శ్రీరస్తు.

శ్రీమద్విద్యానందగురువరాంతేవాసియగు

శ్రీపూర్ణానందదీక్షానామవిశ్రుతబ్రహ్మణ్య

సేలటూరు-సుబ్రహ్మణ్యవిరచితంబగు

# బోధానందగీతా

నామక

# శ్రీబ్రహ్మవిద్యావిలాసము.

ఇది

ఏతద్గ్రంథకర్తచేఁ

బరిశీలింపఁబడి

చంద్రగిరి-సుబ్బయ్యసెట్టిగారిచే

చెన్నపురి:

కొం. పె. చెంగల్వరాయసెట్టిగారి

శ్రీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1880.

శ్రీవిద్యానందగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ బోధానందగీతలు

అను

# శ్రీ బ్రహ్మవిద్యావిలాసము.

## ఇష్టదేవతాప్రార్థనాదికము.

౧, శా॥ శ్రీరాజిల్ల జగత్స్థితిప్రళయ సృష్టిచ్ఛన్ విరాణ్మూర్తియై। యారూఢస్థితి భక్తకోటికిసుఖార్థంబౌ నభీష్టంబులం। గారుణ్యాంచితదృష్టి నిచ్చుచుం దగన్ గైవల్య సంప్రాప్తినే । పారంగూర్చెడి చిత్సుఖాత్మక పరబ్రహ్మంబు భావించెదన్. ౨, క॥ విధివిష్ణీశ్వరుల సమ్య । గ్విధిం గొల్తు విరాజమాన గీర్వాణులధీ । నిధుల న్భవభయ హరుల । న్బుధ మానసచరుల గురుల మోక్షాకరులన్. ౩, క॥ వరలక్ష్మీ వాగ్గిరిజల । మురహర కమలజ పురారి మూర్తుల సతులన్। పరమాత్మైక్యప్రదలన్ । జిరసచ్చిత్సుఖ విధాన శీలలం గొలుతున్. ౪, క॥ శ్రీగణ నాథునిఁ గొల్తువి। రాగమహిత రాజ యోగ రంజక విలస । ద్యోగప్రజ్ఞానప్రద । నాగాభరణాత్మజు విఘ్ననాయకు నమలున్. ౫, క॥ హనుమంతు న్సేవింతు। న్ఘునమానస కమలకర్ణికం జేర్చిబుధా । వనలోలున్గుణశీ

లుఁ | వినమిత సురజాలు గురువివేక విశాలుఁ. ౬, తే॥ సంస్కృతాంధ్ర ప్రపంచ వ్యాఖ్యానసులగు | వ్యాస వాల్మీకి నన్నయభట్టు తిక్క | నార్యముఖ్యుల వినుతించి యాధునికక| విప్రవరుల ప్రభావము విస్తరించి. ౭, తే-గీ॥ సుకవులకు దండమర్పింతు సూటిమీఱ | యతిగణప్రాస భంగము ల్మతి కొఱవడ | నాయవజ్ఞతఁ దలపఁక నయముతోడ|భావ మెడ యొక దిద్దితీర్పంగఁ గోరి. ౮, తే-గీ ॥ గొప్ప శాస్త్రంబు లుండ నీగుణవిహీనుఁ | డేల యీకృతిఁ జేసెనం చీసడించఁ| బోకుఁ డేఱు లనేకము ల్పొంగి పొరలఁ|బిల్ల కాల్వలు వాని లోఁ జెల్ల వెట్లు. ౯, తే-గీ॥ కుకవులకు మ్రొక్కి ప్రార్థింతుఁ గూర్మితోడ | నర్థమును శబ్దలక్ష్యంబు లందరాని | చోట్లఁ దమతలద్రిప్పుటల్ చూరఁ జెక్కి | వేత్తలను జేరి యర్థంబు విశదమరయ.

## శ్రీ గురు స్తుతి.

౧౦, శా॥ శ్రీమత్తత్త్వమసీతి వాక్యముల నిశ్రేణిక్రమం బొప్పను|ద్ధామధ్యేయ పదార్థనిర్ణయ సుఖార్థం బేర్పడంజేసి సు|క్షేమస్థైర్యధృతిప్రమోద విజయాశీర్వాద దీక్షావిధిఁ|బ్రేమన్ నన్ గుఱి నిల్పు కారణగురుం బ్రేమాకరుం గొల్చెదన్.

౧౧, చ॥ అనుపమ యోగధర్మముల నార్యులు మెచ్చఁజరించి తన్నుతాఁ | డిన నయమార్గ శీలురకు తీవి సుఖాస్పద హేతు భూతమై | తనరెడి రాజయోగము ముదంబునఁ గూర్చుచు

స్వానుభూతి బో | ధను దనుఁదోఁపఁజేయు గురుధన్యుని
మాన్య వదాన్యుఁ గొల్చెదన్. ౧౨, శా॥ పూర్ణప్రజ్ఞ నశే
షధర్మముల సంపూర్ణప్రభా శాలిఁగా | నిర్ణీతస్థితి నాత్మ
బోధల ననున్నిర్వ్యాజ కారుణ్యుఁడై |పూర్ణానందుఁ డనం
గఁ బేరిడి ప్రబుద్ధుఁజేసి రక్షించుశ్రీ | పూర్ణాద్వైత ప్రభా
కరుం గురువరుం బూజింతు మోక్షార్థినై. ౧౩, శా॥ హృ
ద్యంబౌ ప్రణవాది లక్ష్యపద నిర్ణీతప్రకాశార్థన | ద్విద్యా
ప్రాభవశీలు నాశ్రితజనావిద్యావినిర్మూలు సం | విద్యోగో
త్సవఖేలు నాగమశిఖావిఖ్యాత వాగ్జాలునిన్ | విద్యానంద
గురున్ భజింతు విలసద్విజ్ఞాన భూపాలునిన్.

## శ్రీ గు రు ని య ను గ్ర హ ము.

౧౪, ఉ॥ సర్వపదార్థ జాలముల సాధుమతి న్మథియించి
కాంచుమా|సర్వముఁ జిన్మయం బితరసాధనల న్బనిలేదు సం
స్పృతి|స్పర్శిన చిత్తము న్మలిచి బ్రహ్మమయస్థితి నుండిచూడు
మా|సర్వము బ్రహ్మమంచ నెడి సద్విధివాక్య విచారశీలతన్.
౧౫, శా॥నిత్యానిత్య విచారయుక్తి క్షురము న్నిష్కర్ష శోధిం
పఁజి|త్సత్యజ్ఞాన సుఖాపదర్శన రసాక్రాంతాత్మ యోగోల్ల
స | చ్చైతన్యంబై యలరారు స్వాత్మరతి నీసౌశీల్యముం దోఁ
చునా | ప్రత్యాహార పదంబుదప్పకుము ధీప్రజ్ఞాప్రకాశో
త్సుకా.

ఈకృతికి హేతువు.

౧౬, క॥ బోధానందుం డనునొక। శ్రీధరభక్తుండు భక్తిజీవబ్రహ్మై। క్యాధార ధారణాపే। క్షాధర్ముండగుచు నన్నుఁ గాంక్షం గొలువన్. ౧౭, తే-గీ॥ త్రివిధదీక్షలఁ గావించి తీవ్రపక్వుఁ। డగుట శ్రవణాదులెల్ల నేనపుడెనడపి। శ్రీమహా వాక్య సంసిద్ధుఁజేసిపూర్ణ। బోధ మొసఁగితి గురు మార్గమున బ్రియమున. ౧౮, క॥ ఆతండును భక్తిశ్ర। ద్ధాతత్పరుఁ డగుచు యోగ ధారణమతిఁదా। నాతత్పద లక్ష్యసుఖా। న్వితుండై ప్రతిభఁజెలఁగు విగత భయుండై. ౧౯, తే-గీ॥ అతని యాత్మస్థితప్రజ్ఞ నతిదృఢంబుఁ। జేయమదిఁగోరి మద్గురు చింతనంబుఁ। జేసి స్వానుభవోక్తులఁ జెప్పినాఁడ। వేత్తలైనను దీనిభావింతు రనుచు. ౨౦, క॥ బోధానందుఁడు నన్నా। రాధన సద్భక్తిఁజేయ రంజిలిదుఃఖో। పాధి దొలఁగ దీక్షావిధి। బోధించితి నిట్లు బ్రహ్మమును దెలియంగన్. ౨౧, క॥ విద్యానందులకృపచే। నుద్యోగించితిని జెప్ప నొగిబ్రహ్మశ్రీ। విద్యావిలాసమనుకృతి। వేద్యంబుగఁ బద్యములుగ విశదంబులుగన్. ౨౨, తే-గీ॥ గురుఁడు పలికింపఁ బలికితిఁ గుచ్చితంపుఁ। బలుకు లివిగావు గురుపదపద్మ ధ్యాన। మాట పొందొందకున్న మన్మతముఁ గాంచి। దిద్దిసరిపుచ్చుకొనుఁడు ధీమంతులార. ౨౩, క॥ విద్యావిహీను లైనన్। విద్యావంతులనుజేరి విశ్రుతమతినీ। విద్యావిలాస మరసిన।

విద్యానందులకృప స్వివేకంబమరున్. ౨౪, క|| ఎఱిఁగిన వారలకనుద | న్నెఱుఁగని వారలకు దీని నెఱుఁగం బనిలే | దెఱిఁగియు నెఱుఁగని వారల | కెఱుక నిలుపఁ జెప్పినాఁడ నెల్లవిధములన్. ౨౫, తే-గీ|| యతిగణప్రాసముల నిజగతు లెఱుంగ|శబ్దనిష్పత్తి సంధుల జాడలెఱుఁగ | గృతియొనర్చితి మద్గురుయతిపతికృపఁ | దప్పులుండిన సైఁపుఁడు తత్త్వ దృష్టి. ౨౬, క|| చదువుల కంతములేదని|మదిఁదోఁచిన గురు నిఁజేరి మర్మమరసి నే | నదియనువదించినాఁడ|న్ముదమంద ముముక్షులెల్ల బోధానందా. ౨౭, తే-గీ|| ఉపనిషత్తుల యర్థంబు లుండఁజూపి | గీతలందుల భావంబు గీలుకొలిపి| గురుఁడు దెలిపిన హితములఁ గూర్చివిమల|బోధమగు కృతిఁ జేసితి బుద్ధిఁగనుము. ౨౮, క||భావంబున కిదివచ్చిన | భావమభావంబునొందు భావంబెడల | న్భావాతీతంబయితగు | జీవన్ముక్తత్వ మదియ చిన్మయరూపా. ౨౯, ఆ-వె|| పూర్ణ బోధమునకు మూడంగములు వలె | గురునిప్రాపు భక్తిఁ గొల్చు నేర్పు | విడని యాత్మకాఁపు వేదాంతి కదిదాపు | బ్రహ్మఁ జూపనోపుఁ బ్రకృతిఁ బాఁపు. ౩౦, ఆ-వె|| బ్రహ్మఁ జూపలేరు ప్రకృతి విశారదు | లాత్మవేత్త లరసి యనుభవ మునఁ | జెప్పి చూపఁగలరు శీఘ్రగతిం దీర్చి | ముగ్ధసతిని రతిని బురుషునివలె. ౩౧, క|| పురుషుండనఁ దానయగున్| దొరసి నవద్వార పురము దోహలమతియై | యరయుచు

విభుత్వమొందఁగఁ|దరమా యితరులకు నిత్యతత్త్వప్రవణా.
౩౨, క॥ తుచ్ఛంబగు నిహలోక సు | ఖేచ్ఛాఅతబుద్ధిసురియు
నేడలఁ జిదిమినఁ| స్వేచ్ఛారతి బ్రహ్మపదా|విచ్ఛిన్న సుఖా
నుభూతి వెలయంగ నగుఁ. ౩౩, క॥ అగు బ్రహ్మం బీసకల
ము | గగనాది సమస్త భూతగతుఁడై యుంటఁ|నిగమం
బు లట్లుపలికెఁ | దగ సద్గురుఁడుఁ జెప్పె దానిన ప్రీ
తిఁ. ౩౪, ఆ-వె॥ దేహ మందుదాఁక దేహధర్మంబులు |
నాత్మ దోఁచుదనుక నాత్మధర్మ|మడియు నిదియుఁ బోవఁ
దుద కెద్దియును లేక| తానునిలుచు దానిఁ దానెఱుఁగు నె.
౩౫, ఆ-వె॥ ఎఱుక వలయు ననుచు మురిసెద రిలజను|లెఱు
క పోవ మరల నఱపు రాదె|యెఱుక మఱపు లెఱుఁగు నెది
దానిపేరెద్ది | దానిఁ నెఱుఁగ వలదెతాత్త్వికులకు. ౩౬,
ఆ-వె॥ తత్త్వముల నెఱింగి తనుఁగనవలె నంద్రు | తత్త్వ
మరయఁబూను తానెవఁడోకో | తత్త్వవిత్త్వములను దల
పోయ స్వోదర|పూర్తికొఱకె పూర్ణ బోధమునకె. ౩౭,
క॥ విద్యానందుని శిష్యుఁడ | వేద్యంబగు నటులొనర్తు వే
దార్థము నీ | విద్యాభివృద్ధి యగున | ట్లుద్యోగము లెల్ల
మాని యాని కనఁదగుఁ. ౩౮, శా॥ విద్యానంద యతీంద్ర
సంస్కృత లసద్విజ్ఞాన యోగంబుచే | సద్యోముక్తి వహిం
చి వర్తిలుదు విశ్రాంతామలారామసం | వేద్యానామక క
ల్పకంబు మొదల న్విశ్వాఖ్య తల్పంబున | న్విద్యావాక్య ని

రూఢ బోధసతితో విఖ్యాత భోగంబులన్. ౩౯, క॥ విద్యానం
దపదంబుల | నుద్యద్గతిఁ బూజఁజేసి యొగిఁ గాంచిననా |
విద్యావిలాస బోధము | సద్యో ముక్తిప్రదంబు సత్యము
పుత్రా. ౪౦, క॥ శ్రీమతి బోధానందా | నీమతి యలరా
రునట్లు నిత్యవిభవునిన్ | శ్రీమద్గురు చరణంబులు | శ్రీమిం
చం గొలిచి నీకుఁజెప్పెదఁ దండ్రీ. ౪౧, తే-గీ॥ గురుని పద
భక్తి తొలఁగిన గుణితొలఁగును | గుణితొలంగిన యప్పుడ
గుణముఁదొలఁగు | గురుని గుణముతన గుణినిల్పి గూఢదృష్టిఁ|
త్రిపుటిఁదెరలించి పరిపూర్ణ తేజముఁ గను. ౪౨, క॥ చీర్ణం
బున దారువువలెఁ | బూర్ణానందాత్మబోధ పాడమ సమా
ధిన్ | దూర్ణంబుగఁ జేసితివేఁ | బూర్ణానందుండ వగుదు
బోధానందా. ౪౩, తే-గీ॥ కనులు మూసితిఁ దెఱచితిఁ
గలఁగఁ బడితి | ననుచు మదినెంచఁబోకు నీవాత్మదృష్టి |
నిశ్చలుండవు కావె నిర్నిద్రుఁడవయి | దేహచేష్టలఁ దలఁప
కఁ తెలివి తొలఁగు. ౪౪, క॥ కాయం బేగతి నున్నన |
పాయం బలదాని వలనఁ బ్రాపించునె నీ | వేయమలుఁడ వ
నితెల్పనె | నీయందును వికృతి కలదె నిర్ణయశాలీ. ౪౫, క॥
దేహగతు లెట్టులైనవి | దేహుం డేననెడి యెఱుకఁ దెలిసి
యలరు మా | యూహ దృఢమగుటకైనేఁ | బోహణగా
నూర్ధ్వదృష్టి బోధనొసఁగితిన్. ౪౬, తే-గీ॥ కాన దేహాది క్రి
యలచేఁ గలఁగఁ బడని | నీకు వేఱొండు దోఁచని నేర్పొ

దవిన । నదియె పరమార్థమగు నిన్ను నలమటలకు । లోఁబ
ఆపఁబోకు వృథగా విలోలదృష్టి. ౪౭, తే-గీ॥ ఆత్మనాత్మ
స్థితప్రజ్ఞుఁడై యలరిన । నీకు వేఱయి యొక్కఁడు నిల్వఁబో
దు । నీకు వేఱని గుఱిపిడి నేత్రయుగము । మాయఁ బడె
నని తలఁచుట మోహమింతె. ౪౮, తే-గీ॥ గురుని లోపల
గుఱినిల్పి గుఱుతు మాపి । గురుఁడ వై యుండు మదియెపో
గుఱియు గుఱుతు । గురుఁడు నటుగాన నీవిట్టి గూఢదృష్టి ।
నున్న దేహాది క్రియలు నిన్నొందఁబోవు. ౪౯, క॥ బోధా-
నందా నీవీ । శోధన నీయందె చేసి శుద్ధాత్ముఁడవై । సాధిం
పుము గురుపదయుగ । మాధారం బనుచు నమ్మి యాత్మ
ధృతిఁగనన్. ౫౦, క॥ నీయుత్తరంబులకుఁ బ్రతి । ప్రా
యం దలపోయు నపుడు వరుసగఁ దోఁచెన్।ధీయుక్తి మె
ఱసీ పద్యము । లాయుక్తులు మదినిఁగూర్పు మమలమనీషన్.
౫౧, క॥ బోధానందా వినఁదగు । సుస్థైర్య సమృద్ధి కొఱకు
నిగమాంతుని మ । న్నాథుని విద్యానందుని।బోధానిధి ధృ
తిఁ దలంతుఁ బూర్ణప్రజ్ఞన్. ౫౨, క॥ అప్పా నిన్నే నెడ
యుట । తప్పని మదిఁ దలఁచఁ బోకు దామోదరు నా ।
చొప్పున గోపిక లరయఁగఁ।జెప్పఁడె మీకు గుఱినిలువఁ జే
యుట కనుచున్. ౫౩, క॥ మనమున నమ్మిన మిత్రుఁడు।కొ
నులకుఁ గనరాని యెడలఁ గలకాలము వా । నిన తలఁచు
చుండు హితుఁ డా । యనువున మాయెందు దృష్టి యల

వటువు సుతా. ౫౪, తే-గీ॥ ఎఱుక లేకున్నమాయందె మొ
ఱుక నిలుచు। నెఱుక నిల్చిన గుఱినిల్చు నెడవిడువక।మెఱు
క గుఱిలోన నిల్చిన నెఱుక గుఱుతు।లుండఁగాఁబోవు గురుఁ
డవై యుండఁగలవు. ౫౫, క॥ శ్రీమద్విద్యానంద।స్వామిప
దాబ్జములు దలఁచి స్వానుభవోక్తుల్। క్షేమమునకుఁ జెప్పె
దఁ జి। ద్భ్యామానందుండ వగుము బోధానందా. ౫౬,
తే-గీ॥ దేవుఁ డొక్కఁడె దిశలలోఁ దెలియ వెలుఁగు।నా వె
లుఁగు లోన సకలంబు నమరి వెలుఁగు।వెలుఁగు లెల్లను నీలో
న వెలుఁగుగాన। వెలుఁగులకు నెల్ల మొదలిటి వెలుఁగు నీవ.
౫౭, తే-గీ॥ నీవు నిద్రింప సకలంబు నిద్రవోవు। నీవు మేల్కొ-
న సకలంబు నిండి వెలుఁగు। నీవు నిల్చిన సకలంబు నిల్చుఁగా
న। నిన్ను నీలోన వెదకుము నిజము గనుము. ౫౮, తే-గీ॥
తన్నెఱింగినఁ దత్త్వంబుఁ దలఁచిచూడఁ। దానె యగుఁగా
ని తనకన్నఁ దత్త్వమెద్ది।తన్నుఁజూచిన దృష్టిని దత్త్వవేత్త।
స్వానుభవమునఁ జేర్చి చిత్స్వంతుఁ డగును. ౫౯, క॥ చిత్త
నఁగా బ్రహ్మంబగు।చిత్తమనఁగ నింద్రియముల జీవస్థలమా।
చిత్తునఁ జిత్తముఁ జేర్చిన।నుత్తమమగు ముక్తిఁ గాంచె దొక్క
నిమిషమునన్. ౬౦, తే-గీ॥ మనసు బ్రహ్మంబు నందునె మ
రులు కొనిన। మఱలి జగమును జూడని మాన్యతఁగనుఁ।బు
టము దీరిన కనకంబుఁబోలె మెఱసి। సాధువుల మ్రోల సం
తృప్తి సంచరించు. ౬౧, క॥ మానసము సమత నెలసిన।

భూనుతమై వెలయు వాని భూరి గుణంబుల్ | జ్ఞాన మేను
భూత మొందుగ | దేనం జెడరాని పదముఁ దెలివిఁ గని
కొనుగ. ౬౨, క|| ఈరీతి స్వద్యము లీ | వారూఢ జ్ఞానమా
త్రుఁ డౌనంతకు నే | నోరూర వ్రాయఁ దలఁచితిఁ|బ్రారం
భ రసాత్మవృత్తిఁ బాలింపవనా. ౬౩, క|| కలకాలము ప్రా
సలలో | పలి దారమువోలె సర్వ వస్త్వంతరమై | వెలుఁ
గుచుఁ బరికించిన లో | వెలి నొక్కటిగాఁగ దోఁచు వేద్య
మమలమై. ౬౪, క|| నాచూపిన కనుసన్న | న్నీచూపలవ
ఱిచి చూడ నేర్చితివే ని | న్నేచూపుఁ జూచి చూడక | జూ
చితి ననుకొనక నిన్నుఁ జూడుము వత్సా. ౬౫, క||నీయంద
కలిగెజగములు|నీయంద లయంబు నొందె నెగడె విచిత్రం |
బాయెను బోయెనునీవిఁక|జేయం జూడకుముదృష్టి చెదరినఁ
గలుగుగ. ౬౬,క|| ఎన్నో రీతులఁ దెలిపితి|చిన్నన్నామఱవఁ
బోకు చిత్సుఖమును నీ|యున్న మహోన్నత పదమును|ఎన్న
ముదుఃఖముల కవలి యొటుకవుఁ బుత్రా. ౬౭, క||దేవాదు
లు బ్రహ్మవిదుని | భావింతురు దేవకార్య పరులై యొక
చో | దేవేంద్రుండు దధీచిని | దేవ హితుఁడ వగుమటంచుఁ
దెలిపి యడుగఁడే. ౬౮, క||సకళంబు నిష్కళంబని | విక
లతనెక్కాలమందు వెతలఁ బడకు నీ | వకలంకుఁడ వమ
లుండవు | ప్రకట సుఖోద్బుద్ధ సూక్ష్మ భావుఁడ వరయగ.
౬౯, క|| సగుణంబె నిర్గుణంబగు | జగదాదుల లోని విక్ర

తి సమరస మైనన్ | నిగమంబు లట్ల పలుకన్ | నగసమ
ధీవృత్తిఁ గనుము నానాత్వములన్. ౨౦, క|| క్రిందను మీఁ
దను వెలుపల | సందుల గొందులను బయలు సందీయక తాఁ|
బొందుకొని యుండుగతి నీ | వందండే యున్నవాఁడ వగు
దోకావో. ౨౧, క|| కారణమన బ్రహ్మము ని | ష్కారణ
మగు ప్రకృతి వీని సామ్యావస్థన్ | వేఱుగఁ జూడక దనుఁ
గను | దారిఁ దెలియ వలయు శ్రుతుల ధర్మము వలనన్.
౨౨, క|| మృత్తును గుంభంబును వలె | సత్తునకు నసత్తునకు
నసంస్పృష్టముగా | దెత్తఱి నభేద మనికని | చిత్తమలముఁ
గడిగి నియతిఁ జెలఁగి వెలుఁగుమీ. ౨౩, క|| సద్వ్యాముక్తికి
మూలము | విద్యావిద్యల కభేద విరతిఁ గనుటనీ | వాద్యంబే
నని తెలియుమ | భేద్యంబగు ప్రకృతి గనక విశ్రుత చతు
రా. ౨౪, క|| నేనే నేనను నీలో | నేనొక్కఁడఁ దోఁ
చినాఁడ నిజముగ నీలో | నేనే నీవని తెలిసిన | నేనేగతి
నీకుఁగలను నిర్ణయశాలీ. ౨౫, క|| నీకన్నను వేఱొక్క
టి | లేకుండుట నిజము జాలిలేక సుషుప్తిన్ | నీకెవరు
గలరో నీవా | లోకన మొనరించి యావలి లీలఁ దెలుప
వే. ౨౬, క|| నాతంద్రీ నీవిప్పుడు | నాతంద్రింబోలఁ
గలవు నాబోధను నీ | వేతంద్రి గంటి జగముల|కాతంద్రివి
నీవె యితర మరసినఁ గలదే. ౨౭, క|| కన్నులకు తెప్ప
లుంబలె | నున్నది యీజగము బ్రహ్మమందు ననుభవం|బు

న్నఁ గనులకగు తెప్పలు|చన్నే తెప్పలకుఁ గనులు జగతిఁ
గలవనన్. ౭౮, క॥ అక్కట నన్నడిగిన నీ | మక్కువగని
యాత్మబోధ మర్మమయిన యే | ముక్కలు చెప్పనిడితినో
యా | ముక్కలు మూడే నిను న్విముక్తుఁజేయున్. ౭౯,
తే-గీ॥ తత్పదం బాత్మలక్ష్యంబు త్వంపదంబు | జీవలక్ష్యం
బు రెంటిని జేర్చు నసిప | దంబు గావున నీకుఁ దత్త్వమసి
యనెడి | వాక్యముపదేశ మిచ్చితవార్య మహిమ. ౮౦,
తే-గీ॥ వేడ్కఁ ద త్త్వంపదార్థసం వేద్యుఁడవయి | యంటి
బ్రహ్మహమస్మ్యని యతి దృఢమతి | నట్లుభావింపు మదియ
నీవైతి నిజము | వేఱు దలఁపకు వెఱ్ఱివై వెతలఁ బడకు.
౮౧, క॥ ప్రజ్ఞానం బ్రహ్మంబను | సుజ్ఞానము పూర్వపుణ్య
శుభగతినీకే|విజ్ఞాతమయ్యెఁ దగనా|ప్రజ్ఞానేత్రంబు మూఁ
త వడనీకు సుతా. ౮౨, క॥ అయమాత్మా బ్రహ్మంబని |
భయవిరహిత దృష్టిఁగనుము బ్రహ్మము బయలై|యయమి
దమను శబ్దములై | వియదాదుల నెల్లఁ దాన వెలుఁగు వి
మలమై. ౮౩, తే-గీ॥ ఇమ్మహా వాక్య ములు నాలుగే
హాత్మ | లాత్మ లక్ష్యార్థ నిపుణులై యరసి కాంతు | రాజ
గత్పూజ్యు లమరుల కందరాని | పరమ పదమందుదురని
ప్రాఁబలుకు పలుకు. ౮౪, తే-గీ॥ యుక్తిఁ దెలిసితి శాస్త్రం
బు లూహఁగంటి|వనుభవం బంతకంత కత్యంత తృప్తి |
నొందఁగాఁ జేసెఁగాదె యింకొండు దలఁప|వలవ దలముక్త

మతిపయి యలరు మనఘ. ౮౫, తే-గీ॥ ఇంతకన్నను పరమా
ర్థ మేమిలేదు|మెఱుఁగ కున్నంత కన్నను చెఱుపు లేదు|ఎ
ఱిఁగి మఱచిన వాఁడగు నెవరెఱుఁగని|దాని నెఱిఁగిన యు
త్తమ ధార్మికుండు. ౮౬, తే-గీ॥ గోపకుఁడు దోలుకొని
పోవుగోవు జాడ | వత్స మేతెంచు చుండెడి వైఖరిఁ బర |
దేసినగు నాదుబోధ బుద్ధిఁగని మార్గ | మెడయ కేతెమ్ము
పరువిచారింప వలదు. ౮౭, తే-గీ॥ ప్రకృతి విద్యాప్రతి
ష్ఠల ప్రబలమైన | దీర్ఘ ఘన కర్మ రుజలవిడిఱుటకుఁ జి |
కిత్స చెప్పెద సద్గురు కృత మహోప | దేశ జయ చిద్రసం
బానఁ దెగును గనుము. ౮౮, తే-గీ॥ రాజమార్గంబు నం
జను భూజనముల | కొరులు మార్గంబు దెల్పఁ బ్రయోజనం
బు | లేనిగతి రాజయోగ నిర్లేప మార్గ| గామివగు నీకుఁబర
బోధ గాథతలఁప. ౮౯, తే-గీ॥శబ్దమందున్న యర్థంబు సర
ణి నాత్మ | యందె ప్రకృతులు వికృతు లింపొంది యుండు|
నాత్మ వెలిగాఁగ నొకటియు సరయ లేదు|తథ్యమిది యని
కనువాఁడె తాత్వికుండు. ౯౦, తే-గీ॥ మాయపుట్టుక యిది
యని మర్మమరయ | సబ్జజాదుల కైనను నరిది గాన | నావి
చారంబుఁ బోదోలి యమలిన మతి | నద్వయుండయి యల
రిన నడఁగు మాయ. ౯౧, తే-గీ॥ నారికేళంబు లోపలి వా
రివలెను | ఆత్మఁదోఁచు వికారంబు లాత్మకన్న|వేఱని యె
ఱుంగు మెల్లను వెఱ్ఱితనము|సర్వ మాత్మస్వరూపంబు సత్య

ముసుత. ౯౨, క|| కన వడగండ్లం దుదకము | గనురీత్రిం బ్రకృతి నాత్మఁగనఁ గనఁబడ దో | ఘనబుద్ధిశాలి మర్త్యుడు| గని ద్వంద్వంబుల నడంచి ఘనతఁ బరఁగుమా. ౯౩, క|| పర మాత్మయందె జీవుఁడు | పురుషాకృతి నొంది మాయ బో ధమఱచి త | న్నరయంగలేక సంసృతి | పరితాపము బొం దుచుండు పర మప్రియమై. ౯౪, క|| జ్ఞానము వైరాగ్యము మే | లైన మహాభక్తి గురునియందుఁ గలుగు నే | వాని హృదయంబు నందా | జ్ఞానాత్మునిఁ బొగడఁ గమల గర్భుని వశమే. ౯౫, క|| ప్రజ్ఞాన దార్ఢ్యఁడైనన్|విజ్ఞానము దోఁచు దాన విశ్వాతీతం | బౌ జ్ఞానమబ్బు నాబ్ర | హ్మజ్ఞానము నేనయను మహాధృతి తోఁచున్. ౯౬, తే-గీ|| జ్ఞాన వైరాగ్య భక్తియోగములు గలుగు|నట్టి పురుషోత్తముని నబ్జ జాది సు రలు | కోరి సేవించు చుందురు కొఱఁత వడని | సర్వ సౌ ఖ్యంబు లొసఁగుచు సత్కరించి. ౯౭, తే-గీ|| విను మనన్య భక్తి విశ్రాంతుఁ డగువాని | వివిధ సంకటములు విడిచి పోవు | నగ్ని నోరయలేని యఖిలవస్తువు లట్లు|కాన గురుని భక్తిఁగలసి మెలఁగు. ౯౮, తే-గీ|| అసలుఁడిగిన గురుఁజేరి యభినుతించి | గాసిఁబడఁజాలఁ బరమార్థ కలితుఁ జేయు| మనిన శిష్యుని గురుఁడు సాధ్యమయినట్లు | దీర్చు గోడనుజి త్రంబు దీర్చినట్లు. ౯౯, క|| అధికారివైన శిష్యుని|విధమెఱుఁ గఁగలేని గురులు వివిధక్రియలన్ | వృథగాఁ గాలము వుత్తు

రు । బుధు లమ్మార్గమునఁ బోరు బోధానందా. ౧౦౦, క॥ తనువు న్మనముక్ ధనము । న్వినయంబున గురున కొసఁగి విశ్వవిజయమా । ఘనతత్త్వ బోధనొందిన।మనుజు స్వర్గింపఁగా సమరులకు వశమే.

ఆత్మదాన లక్షణము.

౧౦౧, క॥ తనువు గురున కొసఁగుట యనఁ । దనుధర్మము లెల్ల నాత్మధర్మము లనుచుక్।దనువాదిగ నభిమానము । లను మానిన యదియ దానిలక్షణ పుత్రా. ౧౦౨, క॥ మనము స్గురున కొసంగుట । యన మనమునఁ దోఁచునట్టి యఖిల వికృతులక్ । గనఁబోక కనినఁ గాంచితి । ననుకోక గురూక్తి నిలువ నదియయగుసుతా. ౧౦౩,క॥ ధనము స్గురున కొసంగుట । యనఁగాఁ గడియించుపట్ల నవి వ్యయమగుచో। టను తానుస్వస్థభావం।బున నుంపిన యదియ యగును బోధానందా.

భావదాన లక్షణము.

౧౦౪, ఆ-వె॥ తనువు గురునకిచ్చితత్త్వం బెఱుఁగవలె।న నెడి చోట నర్థమరయ వలయు । తనువు నేనుగాను దత్పదం జేసని । తెలియు తెలివి దీని తెఱఁగిదియగు. ౧౦౫, ఆ-వె॥ మనము గురున కొసఁగి మర్మంబెఱుఁగవలె । ననెడి చోట నర్థమరయ వలయు । మనము నేనుగాను మాయకావలి వాఁడ। నను యథార్థ దృష్టియని యెఱుంగు. ౧౦౬,

ఆ-వె॥ ధనము గురున కిడుట ధర్మం బనెడిచోట | ఘనుల భావమరసి కాంచవలయు|ధనము దుఃఖముల నిధానస్థలం బని|యాసగోసి యలరుటనియెఱుంగు.

## క్రియాదాన లక్షణము.

౧౧౭. ఆ-వె॥ నిర్గుణుండు గురుఁడు నీవుగుణివి నీకు| నిర్గుణత్వసిద్ధి నెగడు వఱకు|దేహధర్మములను దీర్చనేర్చినక్రియల్| సేయ వలయు గురుని సేవఁజేసి. ౧౦౮, ఆ-వె॥ ఆస లుడిగినట్టి యాతఁ డాచార్యుండు|యాస లుడిగి నీవు నలరు వఱకు | లోభ వృత్తిలేక లోకుల వలెఁగాక| నన్న మొసఁగ వలయు నధికభక్తి. ౧౦౯, తే-గీ॥నిర్మనస్కుండు గురుఁడౌట నిజమెఱింగి| ధర్మమార్గంబు దప్పక దయయుఁ బ్రియము | నిర్మలత్వంబు నిష్ఠయు నియతి గలిగి| నట్టి నీమన మాతనియంద నిలుపు.

## సద్గురు లక్షణము.

౧౧౦.క॥ గురుఁడే బ్రహ్మయువిష్ణువు|గురుఁడే గిరిజాప్రియుండు గురుఁడే గురుఁడౌ | గురుఁడే సాక్షాద్బ్రహ్మము | గురు నభివందన మొనర్చు గుణి నిలుచుటకై. ౧౧౧, క॥ జీవమున్నవేళ జీవవస్తువు లిచ్చి|జీవి నిల్పువాఁడె దేవుఁడనగ | జీవభావ ముడిపి చిత్సంజ్ఞఁ దనుఁదెల్పు | గురుఁడు వాసుదేవ గురుఁడ కాఁడే. ౧౧౨, తే-గీ॥తనకుఁ బుట్టినవానికి ధనమొసంగు|తన్నువలచినభార్యనుదనువు రతులఁ|దన్ను

గురునిఁగఁ గోరిన ధన్యశిష్యుఁ| డన్నఁగాఁజేయు గురుఁ
బోలు దాతగలఁడే. ౧౧౩, క|| పుత్రునకిచ్చును ధనముక|ళ
త్రంబునకిచ్చుఁ దనువు లలితుని శిష్యుం| బుత్రాదీషణజాలల|
విత్రుండని గురుఁడు తన్ను వేడ్కనొసంగున్. ౧౧౪, క||
కొమరుఁడు సచ్చిన దుఃఖము | సమతగొను స్గురుఁడు విసివి
ప్రస్గఁడు శిష్యుం | డమలుండు గానిచోనా | విమలున కతి
దుఃఖమగు వివేక నిధానా. ౧౧౫, క|| అంతేవాసిని నే
నని | పంతంబునఁ బూజచేసి పామరుఁడైనన్| వంత గురు
నకగు జనకుఁడు | చింతంబొందించు పుత్రుచేఁ జివుకండే.
౧౧౬, ఆ-వె|| లోక ధర్మములకు లోఁబడఁగాఁ బోని | ప
రమభక్తు శిష్యుఁ బడసినట్టి | గురుని భాగ్యమరయఁ గు
రువింద మణిఖనిఁ | గన్న వణిజు భాగ్య గరిమగాదె.
౧౧౭, క|| కలిమి గలుగు శిష్యునిఁ గని | కలికి తన
ము వెలయఁ బలికి కాన్కలు గొనుచున్ | బలిహరిగతి నా
విద్యక|మలబంధన మాహరించు మర్త్మి గురుఁడగున్.౧౧౮,
ఆ-వె|| దాసజనులఁజేసి తత్త్వంబు దెలుపుచు | నిచ్చపూజ
లంది యింటనుండి | యావసిష్ఠఋషియు నాజిపుత్రుఁడుఁ
బోలె | నతుల బోధసేయు నతఁడు గురుఁడు. ౧౧౯,ఆ-వె||
కరుణ గలిగి శిష్య కర్మంబుదీఱిన | కాలమెఱిఁగి యుక్తిఁ
గఠిను బోయఁ | బ్రోచు సప్తఋషుల బోలి సాధుండైన|
గురుఁడు గురుఁడు గానిగురుఁడు పటుడు. ౧౨౦, తే-గీ|| బి

చ్ఛగానికి నన్నుంబుఁ బ్రీతిఁబెట్టు । పుణ్యసతిగతి గురుమూర్తి పుణ్యమూర్తి । యైనశిష్యుని నిర్వ్యాజమైన కరుణ । బ్రహ్మమంద్రైక్య మొందించుఁ బరమరూఢి. ౧౨౧, తే-గీ॥ అంధమగు నేత్రములు వచ్చునట్టు లౌష । ధంబొసంగిన వైద్యునిఁ దలఁచు గ్రుడ్డి।యట్టు లజ్ఞానమను గ్రుడ్డినడఁచి పూర్ణ। బోధ నేత్రంబొసఁగు గురుపూజ సలుపు.

## కార్యగురులక్షణము.

౧౨౨, క॥ భవ్యంబగు బ్రహ్మంబున్।దివ్యంబుగఁ జూపుదునని తిరుగుఁ బలుమఱున్।ద్రవ్యాసక్తిని శిష్యుని।ద్రవ్యంబు హరింప జడుఁడు తత్త్వమెఱుఁగమిన్. ౧౨౩, క॥ ధనమే ప్రయోజనంబుగఁ । దను భక్తిభజించు శిష్యధనము హరింతుర్ । ఘన యోగధర్మ మెఱుఁగని । వినికి పరులు పూర్ణబోధవిధమెఱుఁగుదురే.

## అజ్ఞానశిష్యలక్షణము.

౧౨౪, ఆ-వె॥ ఎఱుఁగఁజెప్పఁ దెలియ వెరవెఱుంగని వాని । కెఱుక గల్గఁబోవ దెంతపడిన । కోయ్యబొమ్మ నెంత కొట్టి చెప్పిన నైన । తెలివి గల్గలేని తెలఁగు కాదె.౧౨౫, తే-గీ॥ సప్త భూమిక లరసిన సరసులైన । చిత్సుఖానంద సమరస సిద్ధులైన । నిర్గుణ జ్ఞప్తి నిల్పు నిర్నిద్రులైన।శిష్యుఁ డధికారి గాకున్నఁ జేయుటేమి.

## హితోపదేశము.

౧౨౬. క॥ ఆకారజన్మ విద్యా। నీకము కతన స్వరుండ నేనని గర్వో। ద్రేకంబున జనఁ బోకవి। కార రహిత వృత్తి నాత్మఁ గనఁదగుఁ దండ్రీ. ౧౨౭, క॥ ప్రాభవ బల యౌవనముల। శోభఁ గొనకు వానిదెంత సుస్థితి విలస। చ్ఛోభి యగు మల్లె యొకతఱి। శోభిల్లదె కొన్నినాళ్లశోక ప్రవరా. ౧౨౮, తే-గీ॥ కామినీజన సంభోగ కాంక్షఁ దగులు। వడిన సద్బుద్ధి యైనను వ్యసన ములకుఁ। బాలు వడునని యోచించి ప్రాజ్ఞుఁ డెపుడు। యుక్తి విహరించు చుండు సుఖోన్నతుఁడయి. ౧౨౯, తే-గీ॥ అనృత జడ దుఃఖ రూపమై యలరు వికృతు। లకు విహార స్థలంబయి లక్ష్యశుద్ధి। గలుగు జ్ఞానుల నలయింప వలను గాక। వెలయు నదియెద్ది యదియ యవిద్య తండ్రి. ౧౩౦, క॥ కరణ త్రయముల సత్వముఁ। బురివెట్టఁగ జాలితేని బుధజన నుతనీ। సరిపోల్పఁ జాలరెవ్వరు। గురుపద యుగళాబ్జ భృంగ గురుజన సంగా. ౧౩౧, క॥ దాఁటి చనవలయు వేగమె। బూటకము ప్రపంచ మనుచు బుద్ధి నెఱిఁగి తా। వాటముగా గురు సేవకుఁ। బాటువమున నతఁడు గూర్చు బ్రహ్మ పదంబున్. ౧౩౨, ఆ-వె॥ దీన వృత్తినున్నఁ దెలియదు తత్త్వంబు। ధృతిని ప్రబలఁ జేసి దివ్య దృష్టిఁ। దనకు వేఱులేని తత్త్వార్థ మెఱుఁగుట। దానియున్న నెళవు తాఁదెలియుట. ౧౩౩, క॥ తర

జేఁగొని యబ్ధి దాఁటిన|కరణి వివేకి . మతినూతఁగాఁ గొని
విబుధా | భరణుండగు కారణగురు|చరణంబులు వట్టి దుఃఖ
సంసృతి దాఁటుఁడీ. ౧౩౪, ఆ-వె|| ఎఱుక గలిగి యున్న
నెచ్చోట నుండిన | నచట నెల్ల బ్రహ్మ మరయ వచ్చు |
దీప మున్నచోట దీప్తికిఁ గొదవయే | దివ్య చిత్తవృత్తిఁ దెలి
యు దీని. ౧౩౫, ఆ-వె|| బ్రహ్మ మనఁగ వేఱె పరదేశమున
లేదు | నీవు నేను భూత నిచయ ములును | బ్రహ్మ మాది
గాఁగఁ బరమాణు పర్యంత | మఖిలజగము నదియ యని
యెఱుంగు. ౧౩౬, క|| అంగము లింగంబని కని | లిం
గము భంగంబు చేసి లీలల నైనన్ | సంగంపుఁ జెరువు
వోకుమ | సంగ జనానంద కరణ సాధు వితరణా. ౧౩౭,
తే-గీ|| గొడ్డటని గొని వృక్షంబుఁ గూల్చినట్లు | మలిన సం
యుక్త చిత్తం బమలిన మతిని | మూలకృంతన మొనరించి
ముదము గాంచి | యవ్య యానంద పద మొంది యలరు
తండ్రి. ౧౩౮, ఆ-వె|| సింహ మాత్మ శక్తిచేఁ గన్న
పలలంబు | ఖగ మృగాదులకును గలసి నట్లు | నీవు నిన్నుఁ
జూడ నిస్పృహీకంబులు | నిత్యతృప్తి నొంది నిన్నెకొల్చు.
౧౩౯, తే-గీ|| అర్థ మభివృద్ధి యగుట లనర్థ మునకే | భో
గ మెక్కుడు గల్గుట రోగ మునకె | యధిక సంపద వఱ
లుట యాపదలకె | యని విచారించి సమదృష్టి నలరు టొ
ప్పు. ౧౪౦, క|| మన మెవనికి పని చేయునా | ఘనుఁ డాతఁ

డు మనము చన్నగతిఁ జను నతఁడో | యనఘా నీచజ్ఞుం డ
గుఁడే | గనుక మనోజయము గాంచి కాంచుము పరముక్. ౧౪౧, ఆ-వె|| మన్ను దిన్నపాము మత్తిల్లి నటువలె | నున్న యంత ముక్తి యుక్తిగాదు | బుద్ధి చూరవచేసి పూర్ణ బోధ నెఱింగి | మెఱుఁగు ఖడ్గము వలె మెఱయు మిలను. ౧౪౨, తే-గీ|| ఎన్ని విధములఁ దెలిపిన నెక్కుడైన | ధర్మ మొక్కటి విను బ్రహ్మకర్మ సలిపి | నిశ్చలానంద పదమున నిలువ వలయు | సర్వ వేదాంత ములలోని సారమిదియ. ౧౪౩, క|| ఆనంద రూపుఁడగు వి | ద్యానంద గురూపదిష్ట మాగమ గదితం | బానంద మయము నగుఁబూ | ర్ణానంద సుఖప్రబోధ రతిఁ గనుమనఘా. ౧౪౪, ఆ-వె|| ఈసుఖం బను భవమయి గానిదీఱ | ఎల్లచోటుల తన్ను గుఱ్తెఱిఁగి శాశ్వ| తుండ నేనౌదు ననిమెడి తుర్యపదము | గుఱిని నెలకొను నంచాఁక గురునిఁ గొలువు. ౧౪౫, తే గీ|| సంశయంబుల విడదీసి చక్కఁజేసి | చిత్సమాధిని నిలిపిన సిద్ధగురునిఁ|బో లఁగల రెట్లు ప్రాకృత బోధరతులు | జీవరత్నంబు లౌ టె ట్లు చిడిపి రాలు. ౧౪౬, తే-గీ|| ప్రకృతి సంసక్తిలేక ప్రవృ త్తినున్న | నితర సంసక్తితోడ నివృత్తి నున్న | పురుషు లందలి ప్రథముండు ముక్తుఁడగును|బద్ధుఁడగును ద్వితీయుండు పటుగుణాఢ్య. ౧౪౭, క|| ఆవల నీవలఁ జూచిన| తావలమై తనకుఁదానె తత్త్వము వెలయుక్ | గావలసిన యర్థంబిది|

భూవలయమునం గురూక్తి బోధానందా. ౧౪౮, క॥ ఈ నందన వనమునని|వానంద తురీయ తల్పమం దనుభవయో|గానంద సుఖము గనువి | ద్యానంద గురు ప్రపూర్ణ ధర్మ రతుండవై. ౧౪౯, తే-గీ॥ చింతలెల్లను గడద్రోసి చిక్కు దీసి | మంతనంబున బ్రహ్మంబు మరులు కొల్పి | సంతతానంద సుఖమంది సమరసమునం|బ్రకృతి వికృతుల బ్రహ్మగాం బ్రౌఢిం గనుము. ౧౫౦, తే-గీ॥ సమరసంబున సర్వంబు సత్స్వరూప|మాత్మ కంటెను వేఱొక్క టరయ లేద|టంచు నెఱింగిన విజ్ఞాన సంచితధన | మెల్లం దగంగొల్లగాంగొంట యేయనికను. ౧౫౧, తే-గీ॥ సాధనంబులం బనిలేదు సర్వసాక్షి | వీవె నీవల్లం గలిగిన దీసమస్త | మిందునను సంశయంబున్ననిపుడె తెల్పు | మాగ మాంతార్థముల దాని నడంపగం నగు. ౧౫౨, తే-గీ॥ ఎద్దియును జూడవలవ దేనెఱింగితి నని | ఎద్దియును చాంక వలవ దేనెఱింగితి నని|ఎద్దియును నెంచ వలవ దేనెఱింగితి నని | ఎద్దియును జేయ వలవదే నెఱింగితి నని. ౧౫౩, తే-గీ॥ ఎల్లగతుల విచారింపు మెఱుక విడక | కలదు లేదను వానినిం గలసి యుండు | సచ్చిదానంద రూపమే సర్వసాక్షి | యదియె పరిపూర్ణ మనంబడు నదియెనీవు. ౧౫౪, క॥ బ్రహ్మజ్ఞాని శరీరము | బ్రహ్మలయ మీవుబ్రహ్మ భావనుం డగుటన్ | బ్రహ్మ జ్ఞానులం గాంచిన | బ్రహ్మావాహం బటంచు ప్రణతి సలుపుమా.

౧౫౫, క|| ఖగముల వినతా సుతుగతి | మృగముల సింగంబు భాతి మేరు వగములం | దగుమాడ్కి సుప్రబుద్ధుం|డుగతి ధృతిస్థైర్య మహితుఁడుగఁ దావెలయున్. ౧౫౬, క|| నీయ జ్ఞానము బలిమిని | నేయను మానములు దోఁచి యేఁచిన నినునిన్ | బాయని యాత్మప్రజ్ఞన్ | మాయింపుము పరమ మగు శమన్ ధృతి వెలయన్. ౧౫౭, క|| ఆకసము విరిసి పడినను | యాకనకాచలము పైకె నరుదెంచిన నీ | కేకలఁ కలు మదిఁ బొడమిన | నీకాంచిన తత్త్వబోధ నియతి విడకుమా. ౧౫౮, తే-గీ|| ఎవ్వరేమైన బోధింప నెఱుక మఱచి| యట్లు లుండునోకో యని యడరు శంక | శాస్త్ర గురు దత్త బోధంబు సడల విడిచి | మసలఁ బోకుము ధృతిదూలి మహిత సుగుణ. ౧౫౯, తే-గీ|| వెలయు నీదగు సంరంభ వితతులెల్లఁ | గామసంకల్ప రహితమా గతి సలుపుము | కలుగు కర్మంబులెల్లఁ బ్రజ్ఞానవహ్ని | దగ్ధమా నంతఁ బాండిత్య ధర్మమొదవు. ౧౬౦, తే-గీ|| యోగవిజ్ఞాన దృష్టులే యోగయుతున | కాత్మఁ బాయవు నాతఁ డత్యంత మహిమ| విష్ణు శంకర విధులొందు విభవములకు | మేల్మియగు పదమున నిల్చి మెలఁగు ననఘ. ౧౬౧, తే-గీ|| తనకు గురుఁ డిచ్చినట్టి తత్త్వ ఘనదృష్టి | విడక సంధాన మొనరింప విలయమొందుఁ|జిత్త చాంచల్య మంత సుస్థిరత నొందుఁ|ప్రాణ పవనంబు లిదిదారి పరముఁ గనఁగ. ౧౬౨, తే-గీ|| సాంఖ్య

విజ్ఞాన యోగికి సాధనములు । నద్వితీయ పరబ్రహ్మ మందు మనము । సంస్థితిం బొంది యలరుట సర్వసమత । సద్వాగ బ్రహ్మ మేనని శాంతిఁ గనుట. ౧౬౩, క॥ క్షరమన నక్షర మనఁగా । పరమనఁగా నొక్కయాత్మ పరఁగుఁ ద్రివిధమై । వరుసగ దృశ్యము దృక్కనఁ । బరమ దృగాతీతమన నుపాధి వశమునన్. ౧౬౪, క॥ పరమైన దృగాతీతం । బురహి న్మాయఁ దగులొంది పొదలెను దృక్కై । మఱి యది యవిద్య నెనయుట । బెరసెన్ దృశ్యమయి త్రివిధ భేదగతులుగన్. ౧౬౫, క॥ విద్యావిద్యలు రెండు । న్వేద్యంబులు దానిఁగాంచు విగత జగత్పం । వేద్యం బదియే యనుభవ । వేద్యంబని యార్యులండ్రు విమల గుణగణా. ౧౬౬, క॥ భావం బభావ మగునా । భావంబు స్వభావమందుఁ బడిల పఱచినన్ । భావా భావంబులు ని । ర్భావంబగు నంతఁ బూర్ణ భావ మమరెడిన్. ౧౬౭, క॥ మనమే బ్రహ్మంబగు నా । మనమునఁగల మలిన ముడిపి మనము నిలిపినన్ మనమే బ్రహ్మంబను నా । ఘననిగమార్థంబుఁ దెలివిఁ గనుమే మఱికన్. ౧౬౮, క॥ భేదంబు వదలు మంతట । నాదంబు లడంగు భేదవాదము లుడుగన్ । వేదాతీతం బొక్కఁడు । ప్రోదిగ వెలుఁగొందుఁ బూర్ణబోధ మయంబై. ౧౬౯, క॥ స్వానుభవంబునఁ జూడుము । నీనామ క్రియలు రూప నిర్ణయములు నీ । వానానీకన్నను వే । రానాతండ్రి మదిఁగనుము

రంజిత ఫణితిఁ. ౧౭౦, క॥ విక్షేపావరణములను | పక్షం బుల జీవహంస భ్రాంతిఁ దిరుగు నీ | యక్షి యుగళంబు నడిమికిఁ | బక్షిం దిగిచి గురుగుహుఁ శివంబై నిలువన్. ౧౭౧, క॥ హంస గురుగుహాను నిలిపిన | హింసలు నిన్నంటఁబోవు హితతమ మతివై | హఁసోఽహమ్మనుమీవి|సంసారాబ్ధిఁ దగఁదాఁటఁ జాలుదు సుమతీ. ౧౭౨, తే - గీ॥ కంటిరా నిన్ను కన్నుల కరువు దీఱ | మంటిరా నేను గురుల లో మహితకీర్తి | నొంటి నిర్భీతి సంగంబు నంటకుండ | నంటి రా నన్ను నిన్నొకం డంటనీయ. ౧౭౩, క॥ కన్నులు దెఱవని నిన్నుఁ | బన్నుగ బోధించు టుడిగి పరదేశమునం| జెన్నుగఁ దిరిగెద నీపెను|గన్నుదెఱచి వేగనన్నుఁ గనుఁగొను మన్నా. ౧౭౪, అన్నన్నా నీచిత్సుఖ | మెన్న న్నాంతరము గాదు యెఱుక మఱవకో | చిన్నన్నా మఱచుట లే|దన్నన్నామనము తృప్తిఁ దనియుర కన్నా. ౧౭౫, క॥ ఈవిద్యారూఢి చేసిన|నావిద్యకమైన వృత్తి యవమతి నొందుఁ | శ్రీవిద్య నీకు నలవడు|శ్రీవిద్యానంద గురుని చిరతర కృపచేఁ.

## జగన్మిథ్యాత్వ భ్రాంతినిరసనము.

౧౭౬, క॥ సవికల్పకమగు నీజగ | మవికల్ప మనంగ నొప్పు నాగమములునా | యవికృతియె విశ్వమనియెఁ | భవ మభవుని యందె యగుట భావింపవనా. ౧౭౭, క॥ శ్రీవిష్ణు నామ దశశత|మీవిశ్వము విష్ణువనిన దేవుని యెఱుకఁ|

భావింపఁ గార్యకారణ। భావంబులఁ గారణంబ ప్రబలెఁ బ్రకృతియై. ౧౭౭, క॥ కారణమే కార్యంబై। వేఱుగఁ దోఁచుబడుఁ దోఁచువిశ్వంబై నీ। చారుతర దృష్టి మృత్తును। వేరగునే ఘటంబు చూచు వెరవు దెలియవే. ౧౭౮, క॥ విశ్వంబు విష్ణుఁడగు నా। విశ్వము విష్ణువన్య మనుచు వెదకిన లేదా। విశ్వము విష్ణుం డగుటను। విశ్వంవిష్ణువనె విష్ణువే నామములన్. ౧౮౦,క॥ఎన్ని విధంబులఁ జూచిన। నున్నదియొకటైన బ్రహ్మ ముత్తమమై తాఁ।గన్నది కలవలెనెన్నినఁ। బన్నుగ బ్రహ్మంబె నిలుచు బయలన్ లోనన్. ౧౮౧, తే-గీ॥ ఇంద్రియంబులు నిన్నెప్డు హింస సేయఁ।జాలఁగాఁ బోవువాని ని సాధువృత్తి।నరసి రక్షించు చుండినఁ బరమ మైత్రిఁ।దాను బెనిచిన శునకము తనుఁ గఱచునే.౧౮౨, తే-గీ॥ ఇంద్రియంబులు నీయిష్ట మెఱిఁగి నడువ।వానిపైఁదప్పువెట్టుటవరుసగాదు। నీవు పూనిన నవిదీర్చు నీపనులను। నీవు పూనని పనికవి పోవ వెఱుఁగు. ౧౮౩, ఆ-వె॥ నీదుబుద్ధి సత్యనియతి నిల్పితివేని। నీదు విషయ తతులు నియతి నిల్చు। రాజ మంత్రులంచు రాజకార్యము దీర్చు। మంత్రియాజ్ఞ నిలరె మహీజనములు. ౧౮౪, ఆ-వె॥ రాజు రాష్ట్రజనుల రసికుఁడై పాలింపఁ।బౌరు లతనిఁ గొల్వఁ బాఱునట్లు। నీవు నింద్రియముల నిజగతి నిలిపిన। నిల్చి నిన్నెకొల్చు నిశ్చయముగ.

## ఆత్మానుసంధానము.

౧౮౫, క॥ కాకాలు చదువు వాని క । నేక గ్రంథములు చదువ నెఱుక గలుగు న। ట్లేకమతి బ్రహ్మమును నా।లోకింపుము నిన్నుఁగా న లోలప్రజ్ఞన్. ౧౮౬, తే-గీ॥ తండ్రిపైఁ బ్రేమగల్గిన తనయుఁడు గలఁ।డైనఁ దండ్రికిఁ బుత్రుని యందప్రేమ । యట్లు నీపట్లు నేను నత్యార్తి నొందు।నట్లు నాపట్లు నీవుండు టదియె ఘనము. ౧౮౭, క॥ చదివింతురు పుత్రుల నా । పదల బడలి యైనఁ గానఁ బరమార్థము నీ । కొదవఁ దలచి శ్రమ చేసెద । నదినీ మదిఁదలఁచి బోధ నలరుము పుత్రా. ౧౮౮, క॥ యుక్తిం దెలియఁగఁ దగును వి । రక్తి గలుగ వలయు ననుట రాగముగాదే । ముక్తికి మార్గము రక్తివి । రక్తులు లేకుంట నిజమురా బుధలోలా. ౧౮౯, క॥ నేనే బ్రహ్మంబని మది । నూనిన సత్ప్రజ్ఞ దృశ్య మొదవమిచే నీ । మానసము నవరణము సే । సినఁ జాలు సమాధి యదియె చిక్కు వడకుమీ. ౧౯౦, క॥ ఎద్దియుఁ గానిది బ్రహ్మం । బెద్దియుఁ గానియది ప్రకృతి యీ రెండొకటే । సుద్దులచేఁ బనిలే దిఁక । ముద్దుగ మౌనము భజింపు బోధానందా. ౧౯౧, క॥ చింతలతోఁ బనిలేదని । సంతోషాంబునిధిఁ దేలి స్వాంతభ్రమలన్ । సంతారణ మొనరింపుము । నంతుఁడవై వెలుఁగుదీవు నయమార్గమునన్. ౧౯౨, క॥ ఎదియెది యేఁగానందువా । యదియే నీవగుదుగాన నటుదలఁ

పకు మీ | వెది యేనని యనుకొందువా | యదినీచేఁ బూ
డఁబడుట నదిగావు సుమీ. ౧౯౩, క॥ ఎన్ని విధంబుల నె
న్నిన | నున్నది బ్రహ్మంబు లేనిదగును బ్రకృతి నీ | వెన్నఁ
డుఁ బ్రకృతిఁ దలఁపఁ బో | కన్నా నాచిన్ని ముద్దులన్నా
కన్నా. ౧౯౪, క॥ ఉన్నది యని తలఁచిన లే | కున్నది
యని తలఁప బుద్ధియొదవునె కనఁగా | నున్నది లేనిది లేదని|
యున్నట్టుల యుండు మయ్య యుత్తమధిషణా. ౧౯౫, క॥
చెప్పెడి దేమున్నది నీ | వెప్పుడు లక్ష్యార్థదృష్టి విమల మతి
విగా|నొప్పుదు విదిసత్యము నేఁ | జెప్పితి మద్గురునిఁ దలఁ
చి చింత వదలుమీ. ౧౯౬, క॥ కాంచినది నిల్వఁగాఁ బో|
చెంచిన తనుధర్మ మెల్ల నెఱుక లయంబౌఁ | బంచీకృతంబు
లెల్లఁబ్ర | పంచాతీతుఁడవు నీవుపలుకు టుడుగుమీ. ౧౯౭,
క॥ పంచీకృత భూతంబుల | నెంచుచుఁ గలకాల మున్న
నెఱుక గలుగునే | మించిన గురు శ్రుత్యుక్తులఁ | జించి ప్ర
పంచంబు నెమ్మిఁ జెలఁగుము పుత్రా. ౧౯౮, క॥ తత్త్వ
విచారణచే నిజ | తత్త్వం బెఱుఁగంగ రాదు తత్త్వంబులు
ని | స్తత్త్వం బగు నెట్లనిన | స్తత్త్వాతీత మహామనియె
సరసముగ శ్రుతుల్. ౧౯౯, క॥ యుక్తిం జెప్పెద వినుమది|
ముక్తికే మార్గంబు విడని ముదము గనుమదే | ముక్తి యటు
లున్న జీవ | న్ముక్తుండవు సత్యమిదియ బోధా నందా.
౨౦౦, క॥ వేరు పనిలేక తన్నే | పారం జూడవలె ననెడి

పోడివదలి స | ర్వార్థ పరముఁ డేనని | భూరి సుఖా
నంద మొందు బోధానందా. ౨౦౧, క॥ ఎక్కడఁ జూచిన
నీవే | చిక్కంటక యుండు దీవ చిన్మయుఁడవు నీ | ఫక్కి
విడఁబోకు మింకనీ | కెక్కడి సంసార బంధ మెన్నఁ గ
లుగునే. ౨౦౨, క॥ ముక్కున నూపిరి నిలిపిన|డొక్క పెరు
గు నింతెగాని తోఁచదు బ్రహ్మం | బెక్కడి మిథ్యా జగ
మిది|బొక్కం బెట్టినను గాని బోధానందా. ౨౦౩, క॥సా
రము బ్రహ్మమనిన సం | సారము బ్రహ్మంబు గాదె సార
మెఱిఁగి సం | సారం బసారముగఁ గని | సారాసారముల
కవలి సారం బగుమా. ౨౦౪, క॥ నామీఁద దృష్టి యుంచు
ము | నీమార్గము దప్పబోదు నిర్ణయ మిదినీ | వేమార్గము
నం దుండిన | నామన మానంద మొందు నయగుణ శాలీ.
౨౦౫, ఆ-వె॥ కన్నబిడ్డ యెంత కఠినాత్ముఁ డైనను | గన్న
తండ్రి మనము కాంక్ష విడదు | విశ్వరూపుఁడైన విజ్ఞాని శు
కునకై | వ్యాసుఁ డడల వినవె యమలచరిత. ౨౦౬, తే-గీ॥
రాజయోగంబు వహియించి రాజవైన | నీప్రభుత్వంబు
లోపల నిశ్చల మతి|నిండి వెలుఁగుచు నీమూర్తి నిలిచి నేను|
సర్వ సౌఖ్యంబు లొక్కట సంగ్రహింతు. ౨౦౭, క॥ రో
గికి నౌషధముం బలె | యోగాదులు బోధహీన యుక్తుల
కగునీ | యోగంబు త్యాగభోగా|ద్యోగంబుల నలరఁ జేయు
మొగి ముక్తుఁడవై. ౨౦౮, క॥ ఒడ్డుగ నీపద్యంబుల | జిడ్డు

కొనిన రసము గ్రోలి చిన్మయతను నీ | జడ్డు తనము వీడిన నా|బిడ్డా నీముద్దుఁ జూచి ప్రీతిఁ జెలఁగుదుఁ గా. ౨౦౯, తే- గీ|| కాన నికఁగొంత కాలంబు కాంతుఁడిట | నీవు నీయు క్తి నీశ క్తి నీయమలత | నాకు నేత్రోత్సవంబుగా నటనసల్పి | నిర్వి కల్పుండ వగుము నిర్మిప్రవృత్తి. ౨౧౦, ఆహవస్మీ యనఁగ నేర్చిన | విహితానుష్ఠాన పరుని విధి విడుచును శ్రీ | మహితుం దారిద్ర్యము వలె | సహజా నందాను భవము సమకొను నపుడే. ౨౧౧, క|| ప్రజ్ఞానం బ్రహ్మంబను | సుజ్ఞానంబునను దెలివి శోభాయుతమై| విజ్ఞాన దృష్టి యలరు| స్ప్రజ్ఞామాత్రునకు నెందు భయము కలుగునే. ౨౧౨, క|| నిండుకయున్నది యాత్మప్ర | చండగతిఁ గా సకలదిశల సదమలగతి నీ | పిండ బ్రహ్మాండంబుల | నుండెడి యాకసముఁ బోలె నుపమ గనఁదగుఁ గా. ౨౧౩, క|| భావం బలరింపుము నీ | కావంతయు శంక వలవ దహామే నీవీ|భావంబు భావమున సం|భావించుచు దానివిడిచి పరముఁడ వగుమీ. ౨౧౪, క|| తోఁచిన గతిఁజెప్పితి నీ|లో చతురత వెలుఁగఁ జేసి లో చూపున నీ|వాచికము కాయికంబు|న్వేచిన మానసము చేత వెదకి కననగుఁ గా. ౨౧౫, క|| సారము నిస్సారము ని | స్సారము సారంబు వానిసారము బయలా|సారాసారమ్ముల కా|ధారం బెద్దియగు దానిఁ దగు భజియింపఁ గా. ౨౧౬, క|| ఆధారంబాధేయము|బోధామల వృత్తిగలదె బోధానందా|

రాధాకృష్ణగురుండీ । బోధన్నను(దేల్చె దీని బుద్ధి నిలుపుమీ. ౨౧౭, క॥ కాదనినను లేదనినను । బోదు విచారించి సూక్ష్మ బుద్ధిc గలదనన్ । భేదంబు లేదు బ్రహ్మము।వాదంబుల లోన వెలి శివస్థితి సలరున్. ౨౧౮, క॥ విద్యావిద్యలc బోదలెడి । యుద్యోగము లడ(చి యుక్తి నూర్జితమగు నీ । సద్యోముక్తిని(c గను మన।వద్యగుణా సర్వ మాత్మవస్తు వనుధృతిన్. ౨౧౯,క॥ ఇంద్రియ జయంబు కావలె । నంద్రుజనులు దాన దెంత యడలక వినుమా । యింద్రియ సమితికి దొరవా । యింద్రియముల శిక్షనిలుపు టెంతపని యగున్. ౨౨౦, తే-గీ॥ ఎంతచదివిన ఫలమేమి వంతదీఱ। మంతు కెక్కిన గురుమూర్తి మాటc దన్ను । మంటిలోc జేర్చి యామంటి మింటcగూర్చి। జంటcబాపక బోధనీ కంటు బెట్టు. ౨౨౧, క॥ వసుధకు విభుcడీ వగుటన్ । వసుధేశుcడ వగుట నదియ వలలును నీ చేc।గుసుమము వృక్షంబును వలెc । బస పొసcగcగc దగదె నీవు బ్రహ్మమయుc డనన్. ౨౨౨, ఆ-వె॥ వాసవాద్యమరుల వరదుc డగుటc జేసి।వాసుదేవ సంజ్ఞ వడసె గురుcడు । బోధ పూర్ణుcడైనc బూర్ణ బోధుండన్న । దోసమేమి దాన గాసియేమి. ౨౨౩, క, వేదనము వేద్యమనcగా । వేదంబులు పలుకుచుండు వేయివిధములన్ । వాదంబుల కాస్పదమై । యాది దెలియc బేరులేని యానందమగున్. ౨౨౪, క॥ భూతంబులు భూతేశులు । భూతవికారములు లయ

ము౯ బొందు౯ బ్రకృతిలో౯ | జైతన్యంబున లయమగు । నీ తోఁచెడివెల్ల నెఱుక నెఱుఁగుము తనయా. ౨౨౫, క॥ రా జాజ్ఞ మీఱు వానిని | రాజే శిక్షింప వలయు రాజిత మతినీ| యోజఁజెఱుచు నింద్రియములఁ|బూజింపకు మంతఁదీఱు బో ధానందా. ౨౨౬, క॥ విషయము లవిషయములె యగు | విషమ గతుల నడుచుమదికి విముఖుఁడవై యే | మృషలనె ఱుంగని నాకివి | విషయములే పూర్ణుఁడనని వెలయు మవి కృతిఁ. ౨౨౭, క॥ అందంబగు గ్రంథంబుల | చందంబులె యనకు పూర్ణ ఘనచిద్రస మే | ఛాందోగ్యోపనిషత్తుల | బృందంబుల నగని నీకుఁ బ్రీతి నొసఁగితిఁ. ౨౨౮, తే-గీ॥ కనులఁ దోఁచునె బ్రహ్మంబు ఖంబునకుఁ బ| రంబుగా వెల్గ యోగ విభ్రాజమానుఁ|డైన గురుమూర్తి ప్రత్యుక్తి నమరఁ జెప్పి| నోరు మూయింప కున్నచో నుతబుధ గుణ. ౨౨౯, క ॥ నిత్యానిత్యంబులలో | సత్యం బెద్దియని మదికి సంశయ మొదవఁ! నిత్యా నిత్యంబులను న|సత్యంబని విడువు మంత సంశయము తెగుఁ. ౨౩౦, క॥ ఇహ పరములలో నెయ్యా ది | సహజం బను సంశయంబు సంధించినచో | సహజా నందము లోపల | నిహ పరములు లేనివనుచు నెఱిఁగినఁ దీఱుఁ. ౨౩౧, క॥ పంచ ప్రాణంబులు ని| న్నొంచని యవి యగుట దాని నెఱుక విడిచినఁ|పంచప్రాణ లయంబయి| పంచద్గతి స్వప్రకాశ సౌఖ్యమొసంగుఁ. ౨౩౨, క॥ వరు

సన్ శమాది షట్కము । నిరవొంద వహించు నేర్పు నెఱుక పఱచెదన్ । గురుభక్తి గుఱుతులొ గుఱి । దఱియన్ జొన్పుమది వానిఁ దత్క్షణమె సఁగున్. ౨౩౩, క॥ మోక్షంబు గాంచెదవు నీ । వీక్షణమున ద్వంద్వసమితి నెఱిఁగి విడువుమీ। దీక్షితుఁడవైతి విఁక నీ । కే క్షేమము బాఁతి సర్వ మెఱుక యొసఁగఁడే. ౨౩౪, తే-గీ॥ సాధులయ్యును భేదసంస్కారులైన । వాదులగుదురు వారితో వాదులిడకు । శాకములు పాకభేదంబు సరణివట్టి । రుచులు వేఱయి తోఁచవే రూఢి మెఱసి. ౨౩౫, ఆ-వె॥ గురుఁడు చెప్పినట్టి గుఱిలోననిల్చిన। గుఱుతు గురునిఁ జేర్చి కూలి వోవు।బొంగరంబుఁ ద్రాఁడుఁ బొందించి చూడుము । బోధ బోధ్యమందుఁ బొనుఁగు వడుట. ౨౩౬, తే-గీ॥ సాంఖ్య తారకముల సరణిని గోరకు। లెక్క సేయఁ జిక్క లెక్కడే యగు । ముక్కు మీఁద దృష్టి మొనసిన ఫలమేమి।చూఁడఁ జూడఁ జూపు సొక్కటరుగె. ౨౩౭, క॥ సుమనస్కులగు ప్రబుద్ధులు।అమనస్కతఁ జెలఁగ రెట్టు లమలులగుచు నీ।సమరస వృత్తిం దెలియుము । క్రమమున గురు రాజయోగరాజపథమునన్. ౧౩౮, క॥ శ్రీరాజయోగి యనఁగాఁ । క్రూరారులఁ జంపి జయము గొనిన నృపువలెన్ । ధీరుండయి ద్వంద్వాదుల । పోరాటము లొందఁ బోని బోధాత్ముఁ డగున్. ౨౩౯, క॥ నీచే నినుఁదెల్పన తగు। నాచే నగుటేమిలేదు నయగుణశాలీ । యీచిత్రం బీవెఱుఁ

గుము | యేచిత్రము లేక తన్ను నెఱుక మఱచుటొ. ౨౪౦, తే-గీ|| ఆత్ముఁడున్నాఁడు సర్వభూ తాంతరములఁ | బైనిఁ గ్రిందను దిక్కులఁ బార్శ్వములను | మించి కని పీడవలయు మేలెంచువాఁడు | సిద్ధ మితరంబు లేదని శేముషిఁగను. ౨౪౧, క|| పృథగాఁ గాలము గడపక | సుధ నమరులు కాంచిన ట్లు సూక్ష్మమగు ధృతిఁ | మథనంబు సేయఁజేయఁ | బుధలోకానంద బోధపొడము శుభగతిఁ. ౨౪౨, తే-గీ|| సుఖము లనుబాసి కనుదన శోకమొదవు | శోకముల వీడి కను. దన సుఖమె తోఁచు|సుఖము దుఃఖంబు నను రెంటి సూట్రద్రుం చి| యుండు మెప్రడున్నరీతి నీయున్న యునికి. ౨౪౩, క|| అజ్ఞానము పోకున్నను|సుజ్ఞానము కలుగఁబోదు సూక్ష్మ మిదియ గుఁ|విజ్ఞానం బావలి చా|త్మజ్ఞానుల మతమదే యథార్థము పుత్రా. ౨౪౪, క||నమ్మితివి నన్ను నీమది|సమ్మదమును బొందుదనుక సవరించెద నేఁ | జిమ్మెద నీభవముల కా | నిమ్మెద గురుభక్తి నిలుపు నిజ మెఱుఁగఁ బడుఁ. ౨౪౫, ఆ-వె|| చూడ వలయుదానిఁ జూచితి వా కద | వీడ వలయు దాని విడువన తగు | చూపు వీడె నేనిఁ జూచుట లేదు సం | పూర్ణ బోధ మదియ పొందు శుభము. ౨౪౬, ఆ-వె|| నేను నీకు లేను నీవు నాకును లేవు | నిశ్చయంబు దీని నిజమెఱుంగు | మేను నీవ నీవ యేనని యెఱుఁగుము | పూర్ణబోధ మిదియె బోధరూప. ౨౪౭, క|| నీవున్నను నిన్నేమఱ | నీవున్నను

మఱుపరాదు నియమ మిదియగుఁ | నీవు నను నెఱుఁగ నేర్చిన |. నీవే నిన్నెఱుఁగ లేవు నిశ్చయముకదా. ౨౪౮, క|| భావం బభావ మనికను | జీవేశ్వరు లనెడి భ్రాంతి చెందదవలసి | భావంబె స్వానుభవ మగు | నీవీ కీలెఱుఁగ వలయు నిజ బోధమునన్. ౨౪౯, తే-గీ|| చూడ దలఁచిన వానిని జూచునప్పు|డుద్భవించెడి యానంద యోగమరసి|చూపులను జూడబడుటను నూటి విడిచి | యవల వెలుఁగొందు నదియ నీ వగుము తనయ. ౨౫౦, తే-గీ|| పంచ భూతంబుల న భంబు గాంచినట్లు | యాత్మ నారసి కాంచిన యతఁడె యోగి | పంచ భూతంబులను జించిపంచి పెంచి | కాంచు కేమిటి లేనిది కానఁ బడునె, ౨౫౧, క|| అన్నా నీకేమార్గం | బెన్నం బనిలేదు తలఁపు నెఱుక నిలిపి యా | తిన్నని పథ మునఁ జను తనుఁ | గన్న జనులతోడఁ గలసి కడు మోదమునన్. ౨౫౨, ఆ-వె|| నిన్నుఁ దెలియఁజేయు నిత్యాను సంధానుఁ | డున్నచోటుఁ జూచి యూహమఱచి | మఱచి నట్టి యూహ మరలి రానీయక | బ్రతుకఁ జూడు పుత్ర బ్రహ్మమయత. ౨౫౩, క|| నాయన నీమనమును నీ | వేయు నుపున నైనఁ ద్రిప్పి నెఱుక నిలిపి సం | దీయక భావన సేయఁగ | నేయది యగు దానిఁ గాంతు నే ననకొనుమీ. ౨౫౪, ఆ-వె|| కనులు దెఱచు కొనుము కాకున్న మూయుము | పండు కొనుము లేక పరుగు లిడుము | చదువు

మొదవ కున్న స్వస్థుండ వగుము నీ । కేల వగవ గత్వము నె న్నానేల. ౨౫౫, క॥ ఆత్మకు వేఱుగ నొకటి య । నాత్మ యనఁగఁ గలదె సాధకాత్మైవాహమ్ । ఆత్మాహమ్మనిగీతల। నాత్మే శ్వరుఁడైన కృష్ణుఁ డనఁడె విజయుతోఁ. ౨౫౬, క॥ జడమైన జగము వెలిగాఁ।తోఁడిఁబడి వెలుఁగొందు నాత్మ తొ లుతటి తెలివిఁ । బడయ వలయుననిరి బుధులు । జడులగు శిష్యులకు బోధ చాలమిఁ బుత్రా. ౩౫౭, క॥ అహమే శ్రీ హరి యనుచును । అహమే శ్రీకంఠుఁడనుచు నహమీ యఖి లం । బహమే నేనును నీవని।సహజ గతిఁ విష్ణుసూక్తి చా టున్పుత్రా. ౨౫౮, క॥ నేననిమెడి శబ్దార్థముఁ । బూసిక నెఱుఁగఁ దగుఁ గాన బోధించెద బో। ధానందా నాయది యన। నేనన దృశ్యమ్ములివి వినిర్మల చరితా. ౩౫౯, ఆ-వె॥ కానఁ బడదు జగము కనులు మూసిన మాత్ర । నిట్టి విశ్వ మెఱుక నెట్టు నిలుచు । భ్రాంతి గాన దానిఁ బాఱంగఁ ద్రో లిన । నెఱుక మఱపు లుండ వెలుఁగుము సుత. ౨౬౦, క॥ కనఁబడు బయలనువిశ్వముఁ।గనఁగనఁబడ దలసుషుప్తిఁ గా నంబడునే।ఘనమైన వికారము లీ । యనువున నాత్మాను భ వము నందుము పుత్రా. ౨౬౧, క॥ ఒక్కఁడ వీవిద్దఁకఁ బలు కకు । మెక్కడిది ప్రపంచ మమలుఁ డీవగుటను నేఁ।జిక్కి త నేనే నీవని । మ్రొక్కి సదాత్మరతి నిలుము బోధానందా. ౨౬౨, క॥ ఆనందో బ్రహ్మంబను।మానిత వాక్యంబు నాగ

మరిబులు పలికెన్|గాన న్నివహ రహమును|సానంద రసాత్మ వృత్తి సమరసుఁడగుమీ. ౨౬౩, క॥ ఏకం ఏవాద్వితీయం|బో కర్మరులార యని ప్రబుద్ధులుగురువుల్|శ్రీకారణులై శిష్యా|నీకములకు బ్రహ్మబోధనెళవు దెలుపరే. ౨౬౪, క॥ విద్యా విద్యల లోన న|విద్యా భాగంబు గాంచి విద్యనెఱిఁగియా | విద్యావిద్యల మఱచిన | సద్యోముక్తుండు వాఁడు సజ్జనతిలకా. ౨౬౫, క॥ ఎఱుక నెఱుఁగ వలె నెఱుకను | ఎఱుక మఱచు నట్టి యెఱుక నెఱిఁగి యవలఁదా | నెఱుకన్మఱపు న్మఱచిన | నెఱుక లయంబొందు దాని నెఱుఁగుము పుత్రా. ౨౬౬, క॥ నిక్షేపము గని లేమిని | అక్షణమునఁ బాసి పొంగునల ధనివలె నా | యక్షిం దోఁచితి మద్గురు | శిక్షావిధి నీకు దీక్షచేసి తినిదగన్. ౨౬౭, క॥ అన్నానాదగు పున్నెం | బెన్నఁ దరము గాదు గురుని ఋణముందీరున్ | ఎన్నిగురుభక్తి నినునీ | కన్నారం గాంచి సుఖముఁ గాఁచితివేనిన్. ౨౬౮, తే-గీ॥ ప్రకృతి సంబంధమైన పుత్ర జననంబు | నందుఁ బుత్రోత్సవముచేసి యలరు జడుఁడు | ఆత్మజునిఁ గాఁగ నిగ్రాంచి యనుపమాన | చిత్సుఖానంద వార్ధి నేఁజెలఁగు టరుదె. ౨౬౯, ఆ-వె॥ సూక్ష్మ బుద్ధిగల్గు సుతుఁగాంచి తలిదండ్రు | లతుల హర్ష వార్ధి నలరుదురఁట | బోధరూపుఁడగు ప్రబుద్ధుఁ డాత్మజుఁడైనఁ | బూర్ణ రాజయోగి భోగమనదె. ౨౭౦, క॥ బ్రహ్మ జ్ఞానికి దేహ

ము|బ్రహ్మ పురంబగును గాన బ్రాహ్మణులఁ బర| బ్రహ్మం బని పూజించుచు | బ్రహ్మానందంబుఁ గనుము ప్రాజ్ఞుఁడ.వ గుచున్. ౨౭౧, క|| బ్రహ్మానందము గాంచిన | బ్రహ్మ విదులు నిన్నుఁజూచి బ్రాహ్మణుఁ డనినన్ | బ్రహ్మానందము నొందుదు | బ్రహ్మఘ్నుల చెంతఁబోకు ప్రజ్ఞ చెడు సుమీ. ౨౭౨, క|| పెద్దలఁ బొడఁగని నవ్వుడు | సుద్దులు పాలించి వారి సూక్ష్మత రోక్తుల్ | నిద్దురలేని మనముచే | దిద్దికొనుము శంకలుడిగి ధీనిధి వగుచున్.

## వ్రతత్రయనిరూపణము.

౨౭౩, తే-గీ|| మూడు వ్రతములు గలవు ముముక్షునకును | వాని నెఱిఁగింతు వినుత విద్యానిధాన | ధర మహాకర్తయుమహాత్యాగితయన|మఱిమహాభోక్తృతయు ముని మతములగుచు.

## మహాకర్తలక్షణము.

౨౭౪, తే-గీ|| జన్మ మృత్యు జరాదుల సంధులందు | జాగర స్వప్న సుప్తులసమయములను| ద్రష్టృ దర్శనదృశ్య తాదాత్మ్యగతుల|సమతనుండు మహాకర్త శాంతచిత్త. ౨౭౫, తే-గీ|| సుఖము దుఃఖంబు రాగంబు సూనృతంబ| సత్యకర్మ మధర్మంబసహ్యము ప్రియ | మనను వీని ఫలాఫలములఁ దగులక | మనునతండు మహాకర్త మాన్యచరి

త. ౨౭౬, క|| అదిచేసితి ననిపల్కక | నిదిచేసితి ననఁగఁ బోక నీహఁ బొదలి నా | కిది కర్తవ్య మనక యే | యదియైనం జేయునా మహాకర్త సుతా. ౨౭౭, క|| పరులపనుల విద్వేషం | బరయక గతమత్సరుఁడయి యచలుండై త | న్నారసిన క్రియలం జేసి య | లరును మహాకర్త ప్రవి మలంబగు తెలివిన్. ౨౭౮, క|| చేసిన పనిచెడి పోయిన | గాసిఁబడఁడు చేయఁబూను కార్యంబులకై | వాసిఁదలఁపఁ డాత్మంబ్రవి | భాసి మహాకర్త యాత్మభావన నిపుణా. ౨౭౯, క|| దేన స్నేస్తము సేయఁడు | దేన న్సాక్షియయి వెలుఁగు దేనిఁ దలఁపఁ డే | ద్దానిం జేయఁ డనీచ్ఛుం|డైన మహాకర్త సద్గుణాంచిత చతురా.

మ హా త్యా గి ల క్ష ణ ము.

౨౮౦, క|| ఇదిసౌఖ్య మిదియసౌఖ్యం | బిదిజననము మరణమిది నిజేతరము నిజం | బిది ధర్మ మధర్మంబని | మదిని మహాత్యాగి గొనఁడు మాన్యచరిత్రా. ౨౮౧, క|| సకలేచ్ఛా విషయంబుల | సకల శుభాశుభ ఫలముల సంశయతతులన్ | సకల నియమ నిశ్చయముల | నకలంకుఁ డనీచ్ఛుఁడే మహాత్యాగియగున్. ౨౮౨, క|| ధర్మాధర్మము లనియెడు | కర్మంబులఁ బొడము పుణ్య కాలుష్యములన్ | నిర్మల మతి దులిచిన ని | ష్కర్ముఁడు త్యాగియనఁ బరఁగు సజ్జనతిలకా. ౨౮౩, తే-గీ|| సర్వ పామర జనముల చక్షురాది |

కముల వెలిలోనఁ దోఁచు వికల్పదృశ్య । సంతతుల వాసన లతోడఁ జక్క విడుచు । నన్నరుండె యగున్మహాత్యాగి యనఁగ.

మ హా భో క్త ల క్ష ణ ము.

౨౪, క॥ అన్నిట కాంక్షల నూడిచి । యన్నిట ద్వేషంబు మాని యనఘ తముండై । తన్పొందిన ప్రారబ్ధము। లన్నియు భుజియించినన్ మహాభోక్తయగున్. ౨౫, క॥ సదసద్రూపంబులచే । గుదిగొను వస్తువులఁ గలుగు గురు దుఃఖములన్ । ముదమున మదిఁదలఁపని కో । విదుఁడు మహాభోక్త యనఁగ విగత విచారా. ౨౬, ఆ-వె॥ముదిమి చావు శ్రమము మోదంబు ఖేదంబు।కలిమి లేములనెడి కవలసుడిసి । మడిసి చెడక వాని మదికిఁ దేనాతని । యతుల భోక్త యందు రధిక మతులు. ౨౭, క॥ తీపైనన్ జేదైనన్ । దాపరమగు నట్టిదానఁ దనివిఁ గొనుచుఁ దా । నా పోజ్యోతిరసోమను । నాపదమున నుండు నమ్మహాభోక్త సుతా. ౨౮, క॥ కనకంబును మృత్తికయును । జననము మరణంబు సాధ్య సాధనము లనం । జను ద్వంద్వంబుల సమరతి । గనును మహాభోక్త జన్మకర్మ విరహితా. ౨౯, ఆ-వె॥ ఈమహావ్రతముల నిరవొందఁగా మది । నూని నిశ్చయించి యుక్తియుక్త । మార్గములను గురువిమర్శచే నను భవ । మునకుఁ దెచ్చు కొనును ముక్తసంగ.

## సా క్షి త్వ ని ర్ణ య ము.

. ౨౯౦. క॥ ఒక్కండయ్యును దినమణి । పెక్కండలం దోఁచినట్లు పిక్కటిల దిశల్ । నెక్కొని వెల్గు పరాత్పరు । నెక్కాలం బెల్లచోట్ల నెఱిఁగి కొలువుమా. ౨౯౧, తే-గీ॥ అంతిపురమున వసియించు నధిపుఁడు పురి । జరుగు క్రియల గవాక్షంపు సరణిఁ గాంచు । మాడ్కి భ్రూమధ్య సంస్థ బ్రహ్మము హృషీక । జాలకంబుల సకల దృశ్యములఁ గాంచు. ౨౯౨, ఆ-వె॥ ముక్కు చక్కిచేసి మూర్ధంబు భావించి । తక్కుఁ గలుగు నట్టి తత్త్వములను । చిక్కు పడఁగ నీక చిత్ప్రదేశంబున । నెక్కొనంగఁ జేయ నెగడు ముదము. ౨౯౩, క॥ చూపు సరిచేసి చూడుము । యీ పరిదృశ్యమగుజగము లెటు దోఁచెడినో । యాపైని శంక దోఁచినఁ । బాపెద లేకున్న నచల పద మదియ యగున్. ౨౯౪, క॥ రాతిరి పవలగు పవలో । రాతిరి గాఁబోదు ప్రజ్ఞ బ్రహ్మ గలపినన్ । జేతో మోదా దిత్యం । దేతరి వెలుఁ గొందఁ దమ మదేక్రియ గలుగున్. ౨౯౫, తే-గీ॥ స్వప్నజాగరముల సమదృష్టిఁ జూడుము । శేషమైన సుప్తి శేముషిఁ గను । మంత స్వానుభవ మయానంద సంవేద్య । మలరు రాక కళల నలరు నటుల. ౨౯౬, తే-గీ॥ నీకు హిత మొక్కటెఱిఁగింతు నిర్మలాత్మ । కార్యములు చేయు నెడల రాగమునఁ దన్మయత్వ మొందకు మచ్ఛమై యలరు స్ఫటి

క | మఖిల వర్ణంబులం బొందిన యంటనట్లు. ౨౯౭, తే-గీ|| ఆత్మ నేనని భావింప నాత్మవగుదు | ప్రకృతి నేననిభావింపఁ బ్రకృతి వగుదు | వింతెగాక సమాధినా వేఱె లేదు | కను ము సర్వంబు బుద్ధి సంకల్పజములు. ౨౯౮, తే-గీ|| సర్వ మాత్మయ యనిచూడు సమరస మతి | లేక మిథ్యా ప్రపంచంబు లేనిదనుచు | నరయు మెట్టులైన నేకమేవాద్వితీయ| మే పరంబది నేనని మేలెఱుఁగుము. ౨౯౯, క|| తొలిచదువులఁ గల పలుకుల | చులుకని దారిగని మది ఋజువు వఱచుచు సం | ధులఁ దూఱనీక నిలిపినఁ | దలఁపని తలఁపగుచు బ్రహ్మతత్త్వము బయలౌ. ౩౦౦, క|| దేన వపుఃక్షోభంబగు | దేనం గర్మములు వోడముఁ దెలివిఁ బురుషుఁ డ | ద్దానిం ద్యాగమొనర్చిన | దేనం జెడనట్టి పరమ తేజ మతఁడగుఁ. ౩౦౧, క|| ధర సుప్రబుద్ధ మతులు | స్వరమాత్మైక్యంబుఁ గాంచు భవ్యమతులు శ్రీ | కర బ్రహ్మనిష్ఠ రతులం| బరముపలెం సంచరింత్రు ప్రకృతి క్రియలన్. ౩౦౨, ఆ-వె|| సత్త్వ పొత్తుచేసి సర్వేంద్రియంబుల | హత్తు వృత్తులందు నలమటించుఁ | జిత్త మత్తమిల్లి చిన్మాప మందున్న| సుత్త రుత్త జగతి యుండఁ గలదె. ౩౦౩, ఆ-వె|| త్రిపుటి జనువు నట్టి తీరెఱిఁగించెదఁ | జూపుఁ జూచుదానిఁ జూడఁబడిన | వాని మూటిగూర్చి వరుస సత్త్వనఁ జేర్చి | చేర్చి నట్టి వృత్తిఁ జిదము మపుడ. ౩౦౪, క|| లోపలి వెలుపలి

చూపుల | మాపుకు రేపున్విమర్శ మరిగి సలిపినను | బా
పుకు జన్మ మరణముల | నాపరమ గురుం దలంచి నమ్ముం
బలికితిఁన్. ౩౦౫, క|| మొదల విచారాంకుర మను | నది
పేలవ మగుచుం దోఁచు నభ్యాసము చే | నది శతశాఖత్వం
బయి | సదమల దృగ్రూపమై రసస్థితిఁ గాంచున్. ౩౦౬,
క|| జగమనఁగ నెద్ది యేననఁ | దగు నదియెద్దియని బోధ
దార్ఢ్యత రెంటిని | దిగఁద్రొక్కి యొక్కగతి నె | వ్వగల
..మిగులు దానిఁ గను మవశ్యము పుత్రా. ౩౦౭, క|| సువి
చార రహిత జీవులు | భవమను సుడిగుండమున భ్రమసి
పడుదు రా | శివవిష్ణ్వాదులు సైతము | భవహరమని బ్ర
హ్మనిష్ఠఁ బాయ రొకతఱిన్. ౩౦౮, క|| శంకర విధి వి
ష్ణ్వాదులు | పొంకము నిజకార్య గతులఁ బొందిబడలి యా|
సంకట హార నిద్రాప | ర్యంకంబగు తుర్యశయ్య యందు
ముడుఁగుదురు. ౩౦౯, క|| కలలేని నిద్రతీరునఁ | గలఁకలు
జాగ్రత్త లేక కడపిన స్వప్నం | బులు గలుగ వేయవస్థలు|
తలచూప వఖండ ధర్మతత్త్వము వెలుఁగున్. ౩౧౦, క||
జాగరమున స్వప్నంబున | భోగాను భవంబు దోఁచుఁ బొ
రిసుప్తిని నే | భోగములు లేవు తుర్యను | లోఁ గనఁ దద్వ
యము లేదలోకం బగుటన్. ౩౧౧, తే-గీ|| అసలను దూరి
కొండల కగ్గిఁబోలు | సాధు సంసేవనోద్బుద్ధ సాక్షిదృష్టి |
దాని సుసమాధి యందు రాదారి గనిన | మోక్ష పదమం

దఁ జేయు విమూఢున్నైన. ౩౧౨, తే-గీ॥ చరము లచరంబు లైనట్టి సర్వభూత | సముదయంబుల వెలుఁగొందు సర్వసాక్షి | మణులలో నుండు సూత్రంబు మాడ్కి దాని|గనుఁగొనందగు గురుశాస్త్ర ఘనమనీష. ౩౧౩, తే-గీ॥ హేతురహితంబు భూత సృష్టితరంబు | జగదుపాదాన కారణం బగుణ మతుల | మాద్య హ్మన్నిష్ఠ మానంద మజర మమల|మైన పరమాత్మ తానాట యరయ వలయు. ౩౧౪, తే-గీ॥ ఫలముఁ గోరక కర్మముల్పరఁగఁ జేసి | దొరకొనిన దాన నాత్మసంతుష్టిఁ జేసి | మహా దుపాశ్రయ మొనరించి మమతఁ గోసి | నిశ్చలస్థితిఁ గనువాని నెఱియవాసి. ౩౧౫, తే-గీ॥కామ రోగాది దుశ్చేష్ట క్రందుమాన్పి।యుపరతి శ్రద్ధలను భక్తి నూతఁగఁ గొని | బుద్ధి సందీప్త ముగఁజేసి బోధమొంది | ముక్తిఁ గనవలెఁ గాక విరక్తి పనిమె. ౩౧౬, క॥ త్రిగుణంబుల కావలిదై | నిగమాంతంబులకునైన నెళవు దెలియఁగా | నఁగ రానిదై యమూర్తం | బగు బ్రహ్మంబు భజియింప నగు గురుసూక్తిꣳ. ౩౧౭, తే-గీ॥ కర్మ మార్గంబు కడఁద్రోచి కాంక్ష లుడిపి | భక్తి వైరాగ్య పద్ధతుల్ పదటఁ గలిపి | నీతి యవినీతి యనుటలు నీఱుచేసి| నిర్వి కల్పస్థితిని నుంట నిష్ఠ సుమతి. ౩౧౮, తే-గీ॥ కూడు కోకకునై మది గోడు కుడిపి | యల్ప విషయ సుఖంబుల కలమటించి | పుత్ర పౌత్రుల పీడలఁ బొగిలి పొగి

లి | గంతుగొను జీవి గురుమూర్తిఁ గాంచుటెట్లు. ౩౧౯. తే-గీ|| ఆత్మ గనలేని వాని యహంకరణము | బాహ్య వృత్తుల చవిగని పడయు దుఃఖ | మరయ సతిపిడి లంజెల మరిగి ముదిమిఁ | బ్రోచు దిక్కెఱి వెతనొందు బొజుగు వలెను. ౩౨౦, తే-గీ|| చిన్నతనమున గురుమూర్తి శిక్షఁ బరము| నాశ్రయించిన గురుపుత్రుఁ డాత్మ సుఖముఁ| గాంచు లేఁదీఁగె గొప్ప వృక్షంబుఁ బ్రాఁకి | దాని కొనగొమ్మఁ బండ్లఁ దానినినట్లు. ౩౨౧, క|| తిల యంత్రంబున తిలలన్ | వలనుగఁ దైలంబుఁ గాంచు వడువున యోగా | మల సత్య దృష్టి మనమున్ | విలయం బొందింపఁ దోఁచు విజ్ఞాన ధృతుల్. ౩౨౨, తే-గీ|| తాలు మూలంబులకుఁ బీడ తగుల కుండ | నిక్షు ఖండమ్ము రసము నానెడి జనముల | చెలువునను బుద్ధి నీదు హృషీక ములకు | బాధ నొసఁగక యమలిన బోధమొందు. ౩౨౩, తే-గీ|| కనువెలుం గీజగంబెల్లఁ గలయఁ గాంచు | మానసం బెల్ల మర్మకర్మములఁ గాంచు | నాత్మ మానస కాయికా ద్యఖిల దృశ్య | జాలములఁ గాంచుఁ బూర్ణ విచార ధిషణ. ౩౨౪, క|| ముదుకండ్రై మోక్షముఁ గన | మదిఁ దలఁచుట మూఢబుద్ధి మనమున్ ద్రాణల్ | శిథిలత్వ మొందు నజ్ఞత | గుదిగొను నాదుఃఖమందు గుటీ గుటీవడునే. ౩౨౫, క|| ధుర్యుఁడును బ్రజ్ఞోదుఁడు నై | శవమున గురుమూర్తిఁ గని ప్రశాంత

లగుట శా | స్త్రవిధిఁ వినవే నీవది | యవధాన మతిఁ
గ్రహించి యలరు ప్రశాంతిఁ. ౩౨౬, క|| పదును గల
చురియ తృణముఁ | గదియఁ దెగిన రీతి మేలుఁగను సద్బు
ద్ధిఁ | మొదలు చెడు వికృతు లాదటఁ | బొదలును బ్రహ్మా
నుభవము బోధానందా. ౩౨౭, క|| గీతంబులు విని చవిఁ
గను | శ్రోత మనము భాతి యాత్మ శోభిల్లెడి యా | చేత
నుని మనము పరమగు | చైతన్య లయంబుఁ గాంచుఁ జలన
రహితమై. ౩౨౮, క|| పాతాళ మునకు జనఁ గం | జా..
తాత్మజు లోకమునకు సరవి నరిగినఁ | జేతో వృత్తము
లడఁపని|యాతని కాత్మప్రబోధ యలవడదు సుమీ. ౩౨౯,
క|| ముని మతములు విధి మతములు | ఘన సద్గురు మతము
నందు గని సమరసతఁ | మనఁజాలు రాజయోగముఁ |
గను మిచ్చిన కనులు విచ్చి కనెదవు పరముఁ. ౩౩౦, క||
బోధాగ్నిం బ్రణయించుచు | సాధక సాధ్యముల రెంటి
సరిగాని వేల్వఁ | వ్యాధులు నాధులఁ దెగు ని | ర్బాధ
కముగఁ బరము బట్టబయలగుఁ బుత్రా. ౩౩౧, క|| అక్షర
త త్త్వం బరయుట | సాక్షాన్మోక్షప్రచార సంగతి గురుఁ
డే | సాక్షాత్కరించి సద్విధి | దీక్షా పరతంత్రుఁ జేయఁ
దేటగఁ దెలియుఁ. ౩౩౨, క|| తెలివిఁ దేనిని జూచిన |
వలనొప్పఁగ నశ్వర ప్రపంచమె తోఁచుఁ | గులసతి హృద
యంబు వలెఁ | విలస ద్గురు చరణ ధరణ విశ్రుత కరణా.

౩౩౩, క॥ ఆకాశ గమన మనియెడు । శ్రీకర యోగంబు గలదు చెప్పెద మనముక్ । జీకాకు జెంద నీయక । నాక సము వలెం జెలంగ నగునది పుత్రా. ౩౩౪, తే-గీ॥ వినుము సత్వస్వరూప సంవిత్తనంగఁ। బడెడి బ్రహ్మంబు స్మృతికిఁ దోఁపని జనునిక । విద్యనాఁబడు ప్రకృతి సంవేద్య మగును। దిక్కు రోగికి దివిభువి దిరుగు నట్లు.

స హ జా నం దా ను భ వ ము.

౩౩౫, ఆ-వె॥ గురుని పేరుదలంచి గుఱుతు సెప్పెద నీకు । నియతి నమ్మకున్న నీదెతప్పు । ఏమిలేని దుత్తదీ బట్ట బయలు నీ । వేనటంట లెల్ల యెఱుక పనులు. ౩౩౬, ఆ-వె॥ గురుని పదము మట్టి గురుగుహ్య మెఱిఁగింతు । గట్టు చెఱిచితేని గురుని తోడు । బ్రహ్మమొక్కఁ డదియ బహు రూపములఁ దోఁచుఁ । దోఁచుభ్రాంతిఁ దోలు దొడరు సుఖము. ౩౩౭, ఆ,వె॥ గురుని సాక్షివెట్టి గురుపుత్ర సంబంధ । బంధ మూడఁగోసి బ్రహ్మమేన । యనెడి వృత్తిఁ గూడ నంతఁబు నొందించి । యవలఁ బలుకఁ బోకు మదియ సమత. ౩౩౮, క॥ గురుఁడౌ దీపము శిష్యుఁడు । సురుచిర కర్పూర మాత్మను విచారము శ్రీ । గురు సంస్పర్శము మూడొక । తఱిఁ గూడిన బట్ట బయలుతత్వము పుత్రా. ౩౩౯, తే-గీ॥ కన్నుఁగవ మూసి కర్ణికా గ్రమున బుద్ధిఁ । గూర్చి యటదోఁచు నిత్యదృగ్రూపుఁడేన ! యని

సమాధిని రూపింతు రైననది య। ఖండ మార్గంబు గాదు సుఖంబు గాదు. ౩౪౦, తే-గీ॥ కర్మ చక్షువులను మూయఁ గానిపించు। బరము కనులను దెఱచినఁ బాటి పోనె। సత్య నిత్యాపరోక్షుండు సచ్చిదాత్ముఁ।డనెడి నిగమాంత రూఢవాక్యములఁ గడచి. ౩౪౧, తే-గీ॥ చూచునది చూడఁబడునది చూపులనెడి। త్రిపుటి కడద్రోయఁ దోఁచు నతీతమంత్రము। త్రోఁపువడు వస్తువొక్కటి తోఁచెనేని। యద్వితీయం పదం బంటు కర్థమేమి. ౩౪౨, తే-గీ॥ వినుము. విమలాత్మ వేదాంత వీధులందు। స్వేచ్ఛ విహరించి యరసి సంసిద్ధుఁడైన। యస్మదాచార్యు కృపఁగన్న యర్థమెల్ల। బ్రహ్మ మొక్కండ యదియు సర్వంబుఁ బుత్ర.

## దుఃఖవిలయలక్షణము.

౩౪౩, క॥ తపమేటికి సంసారా।తపమునఁ దపియించు నీకుఁ దాపము దీఱన్। దపనోద్దీప్తుండగు గురు। ని పదంబులఁ గొల్చి బ్రహ్మనిష్ఠ నలుపుమా. ౩౪౪, క॥ ఎత్తఱిజన్మస్థితి లయ। మత్తగు ప్రకృతి విడనాడి మనమును బ్రహ్మాయత్తముగఁ జేయ నేర్చిన। యుత్తము దుఃఖములు దొడర నోపవు పుత్రా. ౩౪౫, ఏనవిలిప్తుండ నజరుండ। జ్ఞానమయుండ నిర్మలుండఁ గాలాతీతుం।డానంద పూర్ణుఁ డేనను। వానిం దుఃఖంబు దొడర వచ్చునె పుత్రా. ౩౪౬, క॥ పంచమహా భూతంబులు। పంచేంద్రియములును విషయ పం

చక యుతమై | పంచప్రాణ మనంబులఁ | ద్రుంచిన ఘను దుఃఖవితతి దొడరదు పుత్రా. ౩౪౭, క|| అఖిలంబు బ్రహ్మ మయమని | సుఖదృష్టిం జూడఁజాలు సుభగ చరితు శ్రీ | ముఖ మమృతాంశు మయంబా | సుఖవాసికి దుఃఖము మదిఁ జొరదు కుమారా. ౩౪౮, క|| దారా పుత్రాదులు త|న్నా అడి పెట్టినను జీవికి యలఁత వడని|శ్రీ|కారణ గురుపద భక్తు నిఁ|జేరవు దుఃఖములు వాఁడు చెడఁడు కుమారా. ౩౪౯, క|| ఆంతర శత్రుల నార్గుర|స్వాంతంబను సచివుచేతఁ జంపించి సదే|కాంతగురుగుహ వసించిన|దాంతుని దుఃఖములు దొడరఁ దలఁపవు పుత్రా. ౩౫౦, క|| ఆదలించి త్రిపుటి యుగళ ముఁ| బెదరక గొని తెచ్చి గురుని శిక్షఁ జదువునా | సదమల సంపద్యుక్తుని | హృదయముఁ జొరఁబోదు దుఃఖ మెన్నఁడు పుత్రా. ౩౫౧, క|| పూసలలో దారము వలె | నీసచరా చరములెల్ల నెఱుకై యుండఁగ|గాసిఁ బడ నేల యనిమది| యాసలుడుపు వాఁడు దుఃఖ మందఁడు పుత్రా. ౩౫౨,క|| కలకాలము నే నొక్కఁడ | నిలుకడగా నుండువాఁడ నిజ మగు నే యీ | పలుగాకి జగద్భ్రమ యని | యలరు మనము వాఁడు దుఃఖ మొందఁడు పుత్రా. ౧౫౩, క|| ఎక్కడి దారాసుతులు మ | ఱెక్కడివీ ధనగృహంబు లెవ్వరుహితు లేఁ | జొక్కితి నెఱుఁగక యనిమదిఁ | జక్కడిచిన వాఁడు దుఃఖ జైత్రుఁడు పుత్రా. ౩౫౪, క|| గురు ఖడ్గముఁ బట్టితి

నను । దురమున నెదిరించి పోరఁ దొడరిన దృశ్యో । ద్ధుర శత్రుకోటి ప్రచ్ఛేద । నురుగతి ననువాని దుఃఖమొందదు పుత్రా. ౩౫౫, క॥ గురు మంత్ర సిద్ధి మున్నే । దరమిన పెన్పాతకములు మదంబున మరలన్ । దొరసిన మారణ హోమము । నరుతు ననిన దుఃఖమతని నమలదు పుత్రా.

బోధోదయము.

౩౫౬, క॥ పరఁగన్ దుర్వాసనలన్ । దుఱపిల్లు మనంబు గ్రాఁగి తొఱఁగున్నుజ్ఞా । నరతి నటు శుద్ధవాసన । వారయన్ జిత్తము నశించు బోధముదయమా. ౩౫౭, క॥ విను నిర్మల చిద్ఘన మా । త్మని యందుదయంబునొంది తోఁచు న్వైతై । ఘన మృగతృష్ణ జలంబులె । యని తోఁచిన రీతిఁ దెలివి నరయ మృషయగున్. ౩౫౮, క॥ దీపంబున వెలుఁగగ్గిని । దాపము రవియందుఁ బవలు దగసుమముల ను । ద్దీపించు తావి చాడ్పున । నోపు న్జిత్తున జగంబు నుదయము గాఁగన్. ౩౫౯, క॥ మున్నీరంతయు జలమై । యున్నట్లు జగంబు లెల్ల నొగిఁ జిన్మయమై । చెన్నలరు నట్లు నీమది। నన్నెము జగమనెడి శంక నందకు మెపుడున్. ౩౬౦, క॥ ఇనుమున నినుమును గోసిన । యనువున మనమున.మనంబు నరసితునిమి నీ । ఘనతఁ గనుంగొను మనఘా । యనుమా నించకుము ముక్తి కదియ తెరువగున్. ౩౬౧, క॥ పుటపాకంబుల హేమము । స్ఫుటమగునటు లాత్మ బుద్ధి శోధించిన

వి | స్ఫుటమగు విజ్ఞానము దు | ర్ఘట మని విడిచిన శుభం
బు-గలుగదు పుత్రా. ౩౬౨, క|| సమ్మెట పెట్లం జదియని|
క్రొమ్మెఱుంగుల వజ్రమట్ల గురుపుత్రుఁడు తగ | గ్రమ్మిన
నజ్ఞానము ధృతిఁ| జిమ్మి వెలుఁగు నాత్మరుచులఁ జెలువమును
రఁగగ. ౩౬౩, క|| రాహుగ్రస్తుండయ్యు వి | దాహత మను
నమృత కిరణుఁ దారిఁ బ్రవిమలుం | డూహాచెడి చెడఁ డవి
ద్యా | మోహముఁ గ్రమ్మినను బూర్ణబోధుఁ డగుటచేగ.
౩౬౪, క|| ఆత్మ విచారణ చేతన | నాత్మం దెగఁ
ద్రుంప వలయు నటుగాకున్నగ | స్వాత్మాపహారి మాన
సుఁ|డాత్మగ బ్రముచ్చిలు నవిద్య నతికి నయమునగ. ౩౬౫,
ఆ-వె|| ఒకని మేలు చూడ నోపని వానికి | మేలు కలు
గఁ బోదు మింట మంటఁ| జూర నిడిన యగ్గి సుడిసి కాల్పదె
యిండ్ల | నగుట యోగి క్రోధమడఁప వలయు. ౩౬౬, ఆ-వె||
పాడిఁ దప్పక బ్రహ్మంబు పట్టువిడక | లక్ష్య లక్షణరతి నా
త్మ లక్ష్యముఁ గని | లక్షణల వీడి సద్గురు శిక్ష మోక్ష |
లక్ష్మి జెన్నొందెది విగత ముముక్షుతమను. ౩౬౭, క|| ము
నుపున్నది నీబుద్ధిగ | గనుఁగొన్నది గురుని బోధ ఘనమా
ర్గంబై |-మనమునకుఁ దృప్తి యొసఁగిన | వినుమది స్వాను
భవమన వివేక ప్రవరా. ౩౬౮, క|| ఏనునినుఁజూడ నీవుగ|
మానుగ ననుఁ జూఁడబోవు మర్మంబిది నీ | మానసమున
యోజించి స | మానాంతఃకరణమున సమాధి సలుపుమా.

౩౧౯, క॥ ఆత్మ సుఖము గోరితివే । నాత్మ యహంభావ
ముడిపి యమల మతుల యం । దా త్మానుభవుల బోధ న।
నాత్మం దెగఁద్రుంపు సర్వ మాత్మయను ధృతిన్. ౩౨౦, క॥
నీవీ తత్త్వంబులు గా।వావలి సద్రూపుఁడవు నిజార్థ మెఱుఁ
గుమా । భావనచే దృశ్యంబు ల । భావంబని తెలియఁ దె
లియఁ బరమ పదమనా. ౩౨౧, క॥ క్లేశంబుల విడువుము
భవ । పాశంబులు నీకులేవు బ్రహ్మం బీవా । వేశం బగును
జగద్భ్రమ । లేశంబున్ గల్గనీకు లీలల నైనన్. ౩౨౨, క॥
నీకాప్తుఁడగుటఁ జెప్పెద ।నీకారణ రూపమైనయెఱుక నెఱుఁ-
గఁగా । నీకర్మదోలఁగ నాత్మా ।లోకన ధృతిగలుగఁ గనుము
లోని తెలివిచేన్. ౩౨౩, తే-గీ॥ నిర్వికారంబు నిత్యంబు ని
ర్వికల్ప । మచ్యుతం బచ్ఛ మానంద మప్రబుద్ధ । మభవ
మాపూర్ణ మధుర మఖండతృప్త । మైన పరమాత్మ రూప
మీవగుదు వత్స. ౩౨౪, తే-గీ॥ వేత్త నిర్వాత దీపంబు విధ
ము చిత్ర । మందుఁ దోఁచెడి పుత్రిక యట్లు నిస్త । రంగ
వారాశి రీతి నిర్వాసనుఁడవు । యంధ మూక జడస్థితి నల
రుఁబుత్ర. ౩౨౫, తే-గీ॥ చిత్స్వ రూపుఁ డగుటచే నజడుం
డవు । నిత్య తృప్తుఁడగుట నిజమభోక్త । వక్రియుండ వగుట
నగుదు వకర్తవ । వ్యాజుఁ డగుటచే నబాధకుఁడవు. ౩౨౬,
తే-గీ॥ అనఘ బ్రహ్మంబు చిత్తవ్యయం బమలము । సత్య
మనుటాదిగాఁగల సంజ్ఞలఁ దగు । నదియ యగు నీజ్జగం

బడి రజ్జు లెఱుఁగ | లేక చెదుదురు నుదిమిఁ జీకాకు నొం
ది. ౩౭౭, తే-గీ॥ సకల దుఃఖంబులను దాను సంఘటించు|
విద్య దొఱఁగిన వాని యవిద్య దొడరి | సతివిడిచి వెలయాలి
వాంఛఁ దగులొందు| వాని వన్నెయు వాసియు వసినరీతి.
౩౭౮, క॥ విలసత్పద మందెదవో| యలఘు గుణా వాసనల
యహంకృతి తోడన|డులిచి నయముగ మెలఁగిని|శ్చలవృత్తి
యఖండ సమరసంబై వెలయన. ౩౭౯, క॥ కామాదులు క
..లుషాత్మకు|నే మోహింపించు బుధుల కెదుర నిలుచునే|కా
మాతుర విటపురుషున|గామ వికారములగలఁచుఁ గలఁచునె
గురులన. ౩౮౦, క॥ బుద్ధియను హయముపై గురు | సిద్ధా
సన మనెడి జీని సిద్ధపఱచి వా | క్స్వద్ధియను చబుకు గొని
గురు | పద్ధతి బ్రహ్మపుర యాత్ర బయలు వెడలుమీ. ౩౮౧,
ఆ-వె॥ త్రోవ నడుచు వాఁడు తోతెంచు తెరువరిఁ | జూ
చియును నుపేక్షఁ జూడనట్లు | బ్రహ్మవేత్త ప్రకృతి బద్ధు
ని వలెతోఁచి | సక్తిలేక యొందు సంపదలను. ౩౮౨,ఆ-వె॥
సంశయంబు లెల్ల సంశాంతి యగుదాఁక|పరమ సుఖము మ
దికిఁ బట్టు దనుక|రహిత శోకవృత్తి రంజిల్లు నందాఁక | శ్ర
వణమనన ములను సంశ్రయింపు.

## సర్వ సంకల్ప నాశన లక్షణము.

౩౮౩, తే-గీ॥ పుత్ర సంకల్పములను నీబుద్ధి నిడకు |
జగము కలదని కలనైన-జంకవలవ | దీసమాధిని నీచిత్త మి

రవు కోనిన । ముక్తుఁడవు నీవె సత్యంబు బోధరూప. ౩౮౪, క॥ సంకల్ప నాశమునకును । సంకట పడవలదు దాని సవరణఁ గని బీ । జాంకురము వేగచిదిమిన|పొంకంబున దానిఁ జిదుమఁ బోలియు నవికృతిక్. ౩౮౫, ఆ-వె॥ ఆకసంబమూర్తమై యెప్పటను జూచి । శూన్య మనుచు బుధులు సొరిది జగము । సంశయించి యిదియు సంకల్పజంబని । రట్లుగాన రెంటి నరయ సమము. ౩౮౬, తే-గీ॥నీవ యున్నాఁడ వంతట నిజముగాను । జూడు సర్వంబు నీచేతఁ జూడఁ బడును । జూడకున్నను లయమొందు సూక్ష్మమిదియ । దీనికై భ్రాంతి నొందకు ధీరహృదయ. ౩౮౭, క॥ నీతలఁపు లోన నిచ్చినఁ । వాతత్త్వము లెల్లవాని నరసి గుణింపక్ |రోఁతయగును దలపోయఁగఁ । జైతన్యం బే నటంచు సాధింప వనా.

పూర్ణానందస్థితి.

౩౮౮, తే-గీ॥ లేని తత్త్వంబు లెల్లను లెక్కచేసి । తుదకు లేదన్న మాత్రనే దొరుకు టేమి । కలదు లేదనుటలు రెండు గాల్చిపుచ్చి । కలఁత లేనట్టి సంద్రంబు కరణి నుండు. ౩౮౯, తే-గీ॥ జ్ఞాన మెచ్చట నజ్ఞాన కర్మ మెచట । బోధ్య మెచ్చట బోధంబు పొడము టెచట । దుఃఖ మెచ్చట నిత్య సంతోష మెచట । నిర్వికల్పుఁడవైన నీనిజ పదమున. ౩౯౦, తే-గీ॥ జ్ఞాన పైత్యంబు పైత్యంబు గాఁగ రెండు । గతులఁ బేరొందు నొకవెట్టి కార్యభేద । కలన నటువలెఁ

బ్రకృతియుఁ గాంచెఁ బేళ్లు | జ్ఞాన మజ్ఞాన మన నిట్లు కను
ము తనుజ. ౩౯౧, ఆ-వె|| తపము చేయనేల తపన నొం
దఁగనేల | యోగమేల సేయ నోడలు నొవ్వ | నాల్క
యెండునట్లు నామకీర్తన లేల| మౌన మభ్యసింపు మానస
మున. ౩౯౨, ఆ-వె|| భోజనంబు చేసి భోగంబులను జెంది|
త్యాగ మొనఁగి ధర్మతత్త్వ మరసి | నిత్యయోగి వగుచు
నెగడుము నాతండ్రి|నీవు నిర్మలుఁడవు నిశ్చయముగ. ౩౯౩,
తే-గీ|| సర్వముఁ బ్రహ్మ మయమని సాధకుండు | గురు
ముఖంబున శ్రవణంబు గోష్యమరసి | విమల సమ్యక్సమాధి
లోవెలి వెలుంగ | విషయముల వీడవలె నంట వెఱ్ఱిగాదె.
౩౯౪, క|| విషయంబు లెల్లఁదనకుఁ | విషయంబులె కా
వె తానవిషయుం డగుటఁ | విషమ శరుండనఁ గలఁడే |
విషమోక్తులుగాక విమల విజ్ఞానసిధీ. ౩౯౫, క|| నీకన్నఁ గ
లఁడె వేఱొకఁ | డీకంటను జూడఁబోకు మేల భయము నీ|
లోకన్ను దెఱచి చూచితి | వేకన్నా నన్నుఁ గన్న బిడ్డ
తెలుపరా. ౩౯౬, ఆ-వె|| నిద్ర పోవునపుడు నీవ యు
న్నాఁడవు | మెలఁకు వందు నీవె మెలఁగు చుంట |
మూర్ఛ యందు నీవు మోదింపు చున్నాఁడ | వెవఁడు
చచ్చుఁ బుట్టు నెఱిఁగి కొనుము. ౩౯౭, ఆ-వె|| చచ్చు
టొకటి లేదు సర్వంబు బ్రహ్మంబు | చచ్చె ననుట భ్రాంతి
చావ దెదియు | మృత్తు వలనఁ బుట్టు మృద్భాండ మగలిన|

మృత్తునందుఁ గలయు మృతియెవరికి. ౩౯౮, క॥ నీటం బుట్టి
న బుగ్గలు । నీటం జరియించి పిదప నీటఁగలయును । వ్యా
టంబున బ్రహ్మంబునఁ। గూటస్థుఁడు దోఁచుఁ గనిన గొబ్బున
గలయుక్. ౩౯౯, క॥ కసుగందనీక సుమముల । రసమానె
డు తేఁటిగతి సరసతం దనుసం । తసమునఁ జూచుచుఁ బెం
పఱి । విసువక స్వేచ్ఛాప్రకార విధుల నలరుమా. ౪౦౦,
తే-గీ॥ నిర్విచారంబె నిర్మల నిష్ఠయనఁగ । బరఁగు నదిసూ
రి జనముల పరసమాధి । దాని మార్గంబు దెల్పితిఁ దత్వ
సార । మది యనుష్ఠింప బ్రహ్మంబ యగుదు పుత్ర. ౪౦౧,
క॥ సంకల్పంబునఁ దనువులు । సంకెల కడ బిందువుల వలెం
దఱుచగు నా । శంకింపనేల ననుభవ । మంకించిన స్పష్టమ
గు మహాగుణశాలీ. ౪౦౨, క॥ సదసద్విచారమననే । సద
మల మగు నెఱుకఁ గనుట శాస్త్రమిటులనే । విదితముగఁ
జెప్పెఁ గననది । మదిఁ దేర్పగఁ జెప్పె నెఱుక మఱచినపర
మా. ౪౦౩, తే-గీ॥ సత్పదార్థ విచారణ సమయమంద ।
సత్పదార్థ మరూపమై శాంతినొందు । సత్పదార్థ విచారణ
సన్నగిల న । సత్పదార్థము పైకొను సంధులిట్లు. ౪౦౪,
క॥ సదసత్తులు రెండిటిలో । నిదిసత్తని యెఱుఁగ బ్రహ్మమే
ర్పడునే కా । దదిమార్గము సదసత్తుల । మొదలు తుదలఁ
దవిలి చూడ మోక్షము బయలౌ. ౪౦౫, క॥ సదసత్తుల
రెంటినివన। నుదితో సమములుగఁ దలఁచి మనమూక్షీనమే।

రహో గురూక్తి । నాశ్రయించిన యాతఁడా యనఘుని కృప । సద్విచార ఘనుండయి సమత వెలుఁగు. ౪౧౩, తే-గీ॥ రత్నముల సాననిడి నిగ్గురాఁ జెలంగు । రత్న వర్తకు మాడ్కి సుశ్రవణ మనన । యత్న సాధనముల నవిద్యం దొలంగి । స్వస్వరూపాప్త సామరస్యంబుఁ గాంచు. ౪౧౪, క॥ జ్ఞానము నిర్వాసన యు । న్మానస జయమే మహాత్మ్య మదిఁ దఱుఁగదొ యా । జ్ఞానికి బ్రహ్మైక్యం బా । మేనం గలుగుఁ సుఖంబు మిగిలి వెలుంగున్. ౪౧౫, తే-గీ॥ పౌరుషంబుఁ బ్రయత్నంబు బహుళభోగ । విరహితంబను నిమ్మూటి విమల వృత్తి । నూని యభ్యాస మొనరించి యుక్తిమైన । నంత పదమొంద వలయు సంశాంతి నొంది. ౪౧౬, క॥ రాగంబును ద్వేషంబును । యోగభ్రంశం బొనర్చు నరగద్వయ మే । యోగపురుషు హృద్బిలసం। యోగము చెందదల వానియోగం బసదే. ౪౧౭, క॥ తెలివియు మానస జయమును । వలనగు నిర్వాసనతయు వరుసగ నివియాఁ। దలఁప నన్యోన్య కారణ । ములు తనకలవడిన నవియు బోధాత్ముఁ డగున్. ౪౧౮, ఆ-వె॥ హృద్గతంబులగు నిరీహ విజ్ఞాన మా । నస జయంబులను మృణాళ ములను।•త్రెంప గుణములట్లు తెగు మనోగ్రంథులు । గాన వాని విడువక మెలఁగ నగు. ౪౧౯, క॥ చిత్తంబును వాసనలును । మత్తిలు ప్రాణచలనంబు మరపి తలఁపులన్ । మొత్తముగఁ బట్టిం

చుటఁ] జిత్తముఁ జిత్తునన మరపి శివముఁ గనఁదగుఁ. ౪౨౦,
తే-గీ|| కర్మ జన్మంబులకు నెల్లఁ గారణంబు | కర్మమునకు
నవిద్యయేఁ గారణంబు| నజ్ఞతకు మూల మభిమాన మట్టి
లగుట | విడువు మభిమాన మదియ వివేకరూఢి. ౪౨౧,
క|| ద్రష్ట ననలేని వృత్తిస |మష్టికి నావరణ శక్తిమత్తని నా
మం | బిష్టమతి నిడిరి బుధులది | కష్టద మజ్ఞాన మనుచుఁ
గానరు మూఢుల్.

## సమరసానుభవలక్షణము.

౪౨౨, సీ|| సతతంబు విద్యావిచార ధీరుల గోష్ఠి ధీదా
ర్థ్య సంస్థితి దెప్పుఁడవయి | యట్టి ధీప్రజ్ఞచే నడుగంట
సంసార తాపంబు దిద్ది చిత్తంబు మాపి | యాంతర దృష్టి
గా నలరు సత్ప్రజ్ఞాసి వెలయ బహిర్వృత్తి ద్రెళ్లఁద్రెంపి |
సంతత సుఖదమౌ స్వాత్మపదంబున సచ్చిత్సుఖానంద సర
సుఁడవయి | యున్నతస్థితి నుండ నీయుభయ లోక | ధర్మ
కర్మంబు లంటు వుదగ్రమగు బ | హిర్ముఖ వ్యాప్తి యడఁ
గు నిర్హేతుక మగు|పూర్ణ బోధుండ వయ్యెదు బోధరూప.
౪౨౩, తే-గీ|| ముక్త మోద ప్రహర్షం బ మోక్షమనఁగ|
దాని విడిచిన వాఁడపో దాంతుఁడనఁగఁ|బడు నతండాత్మ
మయుఁడయి పరమమైన| వాఁడు సద్వాసనామయ వాసితుం
డు. ౪౨౪, క|| వేద్యుండను భవరుజలకు | వైద్యుండను
బరమతత్త్వ వార్ధిశయనుఁ డ | చ్ఛేద్యుండను త్రిగుణంబుల|

కాద్యుండను నేనయనుచు నరయుము మమలతన్. ౪౨౫, క॥
చిత్త హరణం బనంబడు । సత్తగలుగు నౌషధంబు సాధిం
పుము ని । న్నెత్తఱిc బోషింపవు పెర । వృత్తము లీభవ
రుజ స్వివేక విశాలా. ౪౨౬, క॥ పాపంబులు పుణ్యంబులు।
నీపట్లన్ నిలిచి బ్రతుక నేరవు వినుమో।మాపోజ్యోతీ రసో
మృత । మాపః పృథివీ యటన్న యర్థ మెఱిcగినన్. ౪౨౭,
ఆపోవై యిదగ్ మ్మని।యేపున బ్రాcబల్కు పల్కు లెఱిc
గితివిcక నీ। పాపము కోపము తాపము। నాపోరూపమునc..
గలిపి యలరు మవిక్కృతిన్. ౪౨౮, క॥ ఈపదునాలుగు భు
వనము । లాపాదము శిరము తుదగ నగుపురుషున కీ । వా
పురుషోత్తముcడవు కా । వాపురుషుcడ వీవుదృశ్యుc డతc
డు తెలియుమా. ౪౨౯, తే-గీ॥ ఏవిచారంబుచే నైన నెఱుక
నిలువc। జిత్త జయమొంద వర్తిల్లc జిత్సుఖంబు । తోcచుc
దోcచిన నదిమదితోcచెననుచుc । దలcపకుండిన వాcడెపో
ధన్యతముcడు. ౪౩౦, క॥ సంవిత్పదంబు గాంచుము । సం
వరుణుని యట్ల గురుని సంశ్రయణమునన్ । సంవాదంబుల
ఫలమే । సంవేద్య పదంబు విడుము సమరస వృత్తిన్. ౪౩౧,
క॥ సాధుజనము లధ్యాత్మము । బోధింత్రు ప్రవృత్తి మార్గ
పూతవిధుల వి।ద్యా ధర్మానుక్రమమున । సాధక మన్నము
నc గూర్చ నైcచు నటువలెన్. ౪౩౨, తే-గీ॥ వాసనాత్యా
గ మొక్కటి వాసికెక్కc । జేసితివయేని సకలంబుc జేకు

ఱఁగల | దెఱుఁగు మర్థంబు గల్గిన నేమి త్యాగ|మునఁగదా కీర్తిగల్గుట ముదముగనుట. ౪౩౩, తే-గీ॥ మనము మారుత మును దగ మలచిపట్టి | నిఁగిఁ జూచుచు నుండిన నిలదు వృత్తి | యంకుశములేని మావటి హస్తిస్వవశ | ముగ నొన ర్చు కొనం జాలని గతివత్స. ౪౩౪, తే-గీ॥ ఒక్కఁడున్నాఁ డు సకల లోకోత్తరుండు | దశదిశాభాస పూర్ణధర్మప్ర వీణుఁ| డాత్మనామకుఁ డతఁడ యీయఖిల దృశ్య | జాల ముల లోనవెలి నుండు శంకరుఁడయి. ౪౩౫, తే-గీ॥ చాలు విద్యలు చదువుట సమరసంబు | గూర్పఁజాలక సద్వృత్తిఁ గూలఁబెట్టుఁ|గాన నిర్మానసుండవై కలఁకదీఱ| యాత్మభా వన నానందమందు తండ్రి. ౪౩౬, క॥ అచ్ఛమగు మనమున కుఁ బొరఁ | పొచ్చెము రానీక బుద్ధి బోధనునిచి నీ|యిచ్ఛని హాలోక సుఖముల | విచ్ఛలవిడి ననుభవింపు విగత భయుఁ డవై. ౪౩౭, తే-గీ॥ తాను నాశమునొందక తఱుఁగఁబడని| నిశ్చలానంద మొసఁగదు నిజముమాయ | దీనిరూపంబుఁ గనఁ బోవఁగానఁగఁబడ|దాత్మ నెఱిఁగిన యప్పుడయవసిమడియు. ౪౩౮, తే-గీ॥ ఎప్పుడీమాయ లేదని యెఱుఁగఁజేసి |యాత్మ పరమాత్మయందు నైక్యంబుసేయు | మార్గ మాచార్యుఁ డెఱిఁగింప మాయ మాయె | మాయె మదిసంశయము వీఁ డుమయ్య వత్స. ౪౩౯, తే-గీ॥ దృశ్యములనెల్లఁ నాత్మగాఁ దెలివిఁ గనుట | విద్యయనఁబడు భేదంబు వెలసెనేని | విద్య

గాదది కావున వేయిగతుల | విద్య నార్జించుటొప్పు వివేక
రూఢి. ౪౪౦, తే-గీ॥ రోగమొదవిన రోగ నిరోధమునకు|
వైద్యుచే నౌషధముగొన్న వైఖరిగను | దృశ్య మొదవిన
గురుఁజేరి తెలివి మీఱి | చిద్రసం బర్థిఁగొని క్రోలి చిమ్ము
ప్రకృతి. ౪౪౧, తే-గీ॥ తన్మయుండయి తనుఁదాన త
త్త్వయుక్తిఁ | దిరుగ నేర్చిన వాని కద్ది మఱికలఁడె|
నిజము గనుఁగొని సిర్భీతి నివ్వటిల్ల | దొరకొనుటరిది వే
దవిదునకు నైన. ౪౪౨, తే-గీ॥ ధాన్యమును దంచి
చేసిన తండుల మగు | తామ్ర మాఖ్య రసంబునఁ దన
రు శుద్ధి | జీవమలను వినాశంబు చేయు గురుఁడు | శ్రవ
ణ మననములను దేర్చి శ్రమలఁ దీర్చి, ౪౪౩, తే-గీ॥ ధా
న్యమే తండులములయి తనరినట్లు |జీవునకు నై జరూప సం
సిద్ధమైన | గుణసమాహిత మలము సద్గురు హితోక్తి| మో
క్ష మొనరింపు మంత సద్బోధమొదవు. ౪౪౪, క॥ నేనెవ్వఁ
డ ననుకొనెదవొ| నేనే నీమూర్తి నిన్ను నీకుఁ దెలుపఁగాఁ|
గానఁబడితి నద్దంబునఁ|గానంబడు బింబమట్లు కనఁదగు తెలి
విన్. ౪౪౫, క॥ అద్దంబుచూచి తనుఁదా | దిద్దికొనెడి రీతి
నిన్ను దిద్దికొనుము నా | సుద్దులను దర్పణంబున |- నొద్దిక
నినునీవ కాంచి యోజిత మతివై. ౪౪౬, క॥ నాబుద్ధి విను
చలింపకు | నీబుద్ధి నిజంబు గనును నిజముగ నచలం | బౌ
బుద్ధిదోఁచు సత్యం | బాబుద్ధి కతీతమీవ యరయుము పు

త్రా. ౪౪౭, క॥ చేయునది కార్యమనఁబడు। చేయఁబడు పదార్థమరయఁ జిరకారణమా। నీయజ్ఞత నివివేఁటుగు। తో యములని తోఁచు చానిఁ ద్రోయుము తెలివిన్. ౪౪౮, క॥ కారణ కార్యంబులను వి। చారించి విశేషబుద్ధి సరిపుచ్చిన నీ। చారుతరమైన దృష్టి స। దారాధ్యంబైన సాక్షివై వెలుఁగొందున్. ౪౪౯, క॥ లీలా మాత్రము జగమను। కీలు గురునిచేతఁ దెలిసి కీలు గెడపినన్। జాలు నపు డుద్భవించిన।బాలు ప్రబోధంబు మాడ్కి భాసిలెదుసుతా.౪౫౦, క॥ ఏమో చెప్పెద ననుకొని। యేమో వింటి ననుకొనకు యోగ రసమిదే!సామీ భవరోగ హరం। బౌ మహిమల నలరు మందు భక్తిన్ గొనుమా. ౪౫౧, క॥ నిష్కారణ మగు కరుణన్। బుష్కలమగు బ్రహ్మవిద్య బోధింతురు ధీ। పుష్కలులగు సచ్ఛిష్యుల। నిష్కల్మష హృదయ మరసి నిండిన ప్రేమన్. ౪౫౨, క॥ ఆధివ్యాధులు శిష్యుని। బాధించెడిపట్ల మిగుల బాధలఁబడి సం। బోధించి పలుతెఱంగుల। శోధించి శుభంబు గూర్చు సుభగుఁడు గురుఁడౌ.౪౫౩, క॥ తనశిష్యుఁ డాధి నొందినఁ। దనపనిగాఁ దత్త్వయుక్తి దానినుడిపి సం। తనగాఁ బ్రబోధ మొందిం।పనవలె గురు కార్య మది. ప్రభాగుణశాలీ. ౪౫౪ క॥ కూలికి పనిచేసిన క్రియ। చాలని గురుబోధచేసి చయ్యనశిష్యుం। జాలిఁబడఁద్రోసి దక్షిణ। కేలంగొని జరుగువాఁడు కేవల గురుఁడే. ౪౫౫,

ఆ-వె॥ దాసుఁడనను వాని తలమీఁదఁ జేయిడి। తత్త్వమ
మరఁజెప్పు దారితప్పి। వాని మనసునొప్పి వాపని గురుఁడై
న। వానికర్మ మవ్యవస్థితంబు. ౪౫౯, క॥కష్టపడెద నీకై నా।
యిష్టంబున నిలిచి చూడు మెఱుక దొలఁగువి। స్పష్టమిది పీ
డుశంక యు। భీష్టప్రదుఁ డగుము భక్తిఁ బ్రియతము మతి
వై. ౪౬౦, క॥ నీవే నేననలేవా। రావా నావార్తత్రోవ
రాజద్గుణ నా। కీవా తనుమన ధనముల। నావాఁ డవుకా
వ దీవనలు చేకోవా.

క్షరాక్షరవిచారము.

౪౬౧. తే-గీ॥ క్షరము సర్వంబు నీవ యక్షరుఁడ వగు
దు। నీదు ప్రాకృత దృష్టిచే నెగడె జగము। నిలిచి చూ
డుము నీయందె నిజము తెలియు। నంత క్షర మక్షరంబు
నం దస్తమించు. ౪౬౨, క॥ క్షర మక్షరమను రెండును।
క్షరతత్త్వములే యగు స్విచారించినచోఁ। బరమార్థము నా
రాయణ। పరమని మొఱవెట్టు శ్రుతులు ప్రౌఢత్వమునన్.
౪౬౩, తే-గీ॥ చూడు మజడత్వదృష్టి లోఁజొక్కి నిలిచి।
చూడఁబడు వానిఁ జూచుచు చోద్యము గను। మం
తలో లయమందు నీయఖిల దృశ్య। సంతతులు స్వస్వరూప
నిజప్రబోధ. ౪౬౪, క॥ కన్నులు కాటుక చేతన్। బన్నుగ
శోభఁగనురీతిఁ బరమాత్మను సం।పన్నుతమగు మదిఁగూర్చ
జ। గన్నుత బ్రహ్మప్రభా వికాసము బయలౌ. ౪౬౫,

క॥ తిన్నని మార్గంబున మును । చన్న జనులతోడఁ గూడి
చనుపథికున కే । బన్నమ్ములు గల్గని గతిఁ ! జెన్నగు గురు
బోధమార్గ సేవన మరవా. ౧౬౩, ఆ-వె॥ ఒడలికంపు
వోవ నొగి జలసేచనం । బాచరించినట్టు లాత్మతీర్థ । గా
హనం బొనర్చి కడుదుఃఖ సంసార । మలము గడిగి కొను
ట మంచిగాదె. ౧౬౪, తే-గీ॥ తత్త్వములతోడఁ బనిగల్గుఁ
దార్కికులకుఁ । దత్త్వవేత్తకు ఫలమేమి దానివలన । క్షు
త్తునకు నోగిరంబు భిక్షునకు వలయు । కట్టు నాఁగేళ్లతోఁ
బనికలదె చెపుమ. ౧౬౫, తే-గీ॥ సర్వమాత్మ స్వరూపం
బు సమరసంబు । సత్య మానంద మమల మజం బమేయ ।
మాద్య మాపూర్ణ మద్వితీయం బబోధ్య । మని గ్రహింపు
ము వేఱులేదరయ నొకటి.

## అసంగత్వము.

౧౬౬, తే-గీ॥ సంగమే సర్వదుఃఖాప్తి సాధనంబు ।
సంగమే యాశలకు నెల్ల జన్మభూమి । సంగమే జన్మ సం
సార సాగరంబు । సంగ మెడసిన వాఁడగు శాశ్వతుండు
౧౬౭, తే-గీ॥ తోఁచఁబడు వస్తువితతిపైఁ దోఁచఁబడెడి ।
మోద ఖేదంబులే సంగమునకు రూప । మగుట నవిత్రుంచి
నిర్మలావ్యయ మఖండ । మైన నీరూపమందె నీయలరుట
యుఱు. ౧౬౮, తే-గీ॥ విడువఁబడిన భయక్రోధ విభవుఁ
డవయి । సమ్మదంబును గోప విషాదములును । వరుసతోఁ

గోసి జగతిపై వర్తిలంగ । నేర్చితివయేని సంగంబు నిన్ను
విడుచు. ౪౬౯, తే-గీ॥ దుఃఖ మనుభవ మునకు రాఁ దొ
ట్రుపడక । సుఖము పైకొను వేళలో స్రుక్కి చెడక । కో
ర్కులకుఁ జోటు చూపక గురులమైత్రిఁ । గాంచితివ యేని
సంగంబు కడఁదొలంగు. ౪౭౦, తే-గీ॥ నామ రూప క్రి
యాయుక్త నటన లందు । వేడ్క నభిమాన ముంచిన వేద
విదున । కైన సంగంబు సంప్రాప్తమై కలంచు । ననఁగ
నభ్యాసి కావ్యక్తి యగునెవత్స. ౪౭౧, క॥ ఈబోధ నీకు
నిలిచిన । నాబాధలు దీఱు నట ననాయాసముగా । నీబాధ
లెల్లఁ దీఱుఁ । శ్రీబోధానందరూప చిన్మయదీపా.

## శ్రీమహావాక్యశుద్ధలక్ష్యార్థము.

౪౭౨, క॥ ప్రజ్ఞానంబ్రహ్మమ్మను । విజ్ఞానానుభవవృ
త్తి విమలుఁడవై నీ । యజ్ఞానముఁ బోనడిచిన । సుజ్ఞానుం
డేనటంచు నుడిఁబడవలయున్. ౪౭౩, క॥ తత్త్వం పదంబులను
గని । తత్త్వంబుల కవలివాఁడు తానని తెలియన్ । దత్త్వద్వయ
మసి మసియగుఁ । దత్త్వంబుల మరలఁదలఁపు దలఁపుడుగఁద
గున్. ౪౭౪, క॥ వినుమ యహంబ్రహ్మాస్మీ । త్యని యవధార
ణము సేసి యఖిలము బ్రహ్మం । బనినిత్యదృష్టి నలరిన । ఘనదృష్టి
నిమరలఁ జేనిఁ గనరాదుసుతా. ౪౭౫, క॥ ఈపద్యంబుల లోప
లి । చూపున దృశ్యములఁ ద్రెంపఁ జూచితివా నీ । చూపుగుఱిఁ
జూపుగుఱిని । న్నే పరునిఁగఁ జూపుఁజూపు నిలిచిన పరమా.

## ఆత్మపూజావిధానము.

౪౭౬, క॥ నేనాత్మపూజ సేయుని । దానం బెఱింగింతు దీనిఁ దత్పర మతివై । పూనికఁ బూజింపుము న । ద్దానం గైవల్య సిద్ధి తడయక కలుగున్. ౪౭౭, క॥ స్వశరీరస్థుని సర్వే । శు శివు న్నిత్యావరోక్షు శోభను సత్యున్ । పశుపతి సర్వగు నభవుని । విశదమతి న్పూజచేసి వేద్యుఁడవగుమా. ౪౭౮, క॥ సర్వము తానగు వానిని । సర్వముఁ జూడక యె చూచు సామిని దిశలం । బర్విన తేజము వాని న । ఖర్వస్థితిఁ గొల్చుటొప్పుఁ గలఁగని మదితోన్. ౪౭౯, క॥ ఘటములు పటములు మొదలగు । జటిలములగు దృశ్యతతుల సమరసవృత్తిన్ । ఘటితంబై వర్తిలఁగల । ఘటనాఘటనాత్మ మూర్తిఁగాంచి దలఁపుమా. ౪౮౦, ఆ.వె॥ కన్ను నోరు ముక్కు కాళ్లు ప్రక్కలు డొక్క । కరము లురము వెన్ను పిఱుఁదు దూరు । మస్తకములు నుదురు మనమును మొదలగు । నవయవముల నుండునతనిఁ గొలువు. ౪౮౧, తే-గీ॥ ఏను శివరూపుఁడను దోఁచు నీసమస్త । జంగమ స్థావరములందు సమత వెలుఁగు । సాక్షి కావలి ద్వయదోష సంగరహిత । తత్త్వ లక్ష్యార్థ మేనని తలఁపు వత్స. ౪౮౨, తే-గీ॥ దేవుఁడేనని తెలిసిన ధీరవరుఁడు । సరసముగ నైజ వృత్తిచే సంస్కరించు । కార్యములఁ గాంచు ఫలముల కాంక్షయొసఁగి । తవిలి ధ్యానింపవలయును దన్నుఁదాన. ౪౮౩,

ఆ-వె॥ ఆత్మపూజసల్పు నతనికి దొరకని । వస్తువులకుఁగా
ను వగవ వలదు । దొరికినట్టిదానిఁ, దోడ్తోడ నర్పించు ।
చుండ వలయు నది యఖండపూజ. ౪౭౪, క॥ తీయని భ
క్ష్యాన్నంబుల । నేయి పెరుగు పాలు గూర్చి నియతిఁ జెలఁ
గఁగాఁ । బాయసముతోడఁ దను నా । రాయణ పరమను
చు భుక్తి రాజిల్లనగున్. ౪౭౫, క॥ శయనము నాసనము
ను సం । శయ రహిత రతిప్రబోధ సామగ్రుల శ్రీ । మయ
మగు స్రక్చందనముల । నయమారఁగ బ్రహ్మమేన యనుచుఁ
గొనఁదగున్. ౪౭౬ తే-గీ॥ దుఃఖరూపములై తోఁచు దుష్ట
మైన । యాధులును వ్యాధులును మహాయాస ములును ।
హత్తికొననప్పు డేకమేవాద్వితీయ । మహామటంచు సుఖస్థితి
ననుభవించు. ౪౭౭, క॥ ఏయే కాలంబుల నే । కేయది సంప్రా
ప్తమగునొ యెఱుక గలిగి నే । కేయవి యర్పణగాఁ గొను ।
మేమెడ నేనున్నవాఁడ నేశివుఁడనుచున్. ౪౭౮, క॥ వాస
నల నంటివచ్చిన । నే సంభారముల నైన నేదుఃఖములం ।
దేసంకట ములనైనన్ । నేసర్వాత్ముఁడ నటంచు నియతిఁ
గొనఁదగున్. ౪౭౯, తే-గీ॥ మంచిఁ గైకొంట చెడు నివ
ర్తించు కొనుట । కీడురోయుట మేలైనఁ గూడి కొనుట ।
సుఖము మేలంట దుఃఖంబు సుడిసె ననుట । లేక నినుఁబూ
జ సేయుచు శోకరహిత. ౪౮౦, క॥ ఏవస్తువు చేఁదప్పి
నఁ । జేవచెడక వచ్చుదాని చేఁ బొదలక నీ । వేవికృతి

నొందకుండుము । దేవార్చన మనఁగ నిదియె ధీరవిచారా. ౬౯౧, క॥ మొదలం దోఁచిన సుఖమున । మది సంతస మందినట్లు మఱిదోఁచెడి యా । పదల న్మనువలెఁ గొనుట యె । సదమల స్వాత్మార్చనంబు సత్యధురీణా. ౬౯౨, క॥ నానావిధ రూపంబుల । నానావిధ నటనములను నానాక్రి యలన్ । నానావిధ నామంబుల । నేనే వెలుఁగుదు నటంచు నెఱుఁగుట వ్రతమౌ. ౬౯౩ క॥ వచ్చిన దాని న్విడువక । విచ్చిన వగనొందఁబోక విశ్రుత మతివై । హెచ్చగు సంభ్రమ తనలోఁ । జొచ్చిన యేఱులను బోలె సొంపుఁగను మనా. ౬౯౪, తే-గీ ॥ కలుగుటలు లేకపోవుట ల్గలుగుపట్లు । వికృతి నొందక వెలయుము విహగమేఘు । తతులు తన్నొంది వీడఁగఁ దాఁ దెలియని । నింగికైవడి పరమాత్మ నిష్ఠ సలుపు. ౬౯౫, సీ॥ కాలదేశంబుల కర్మవశంబుల వచ్చు శుభాశుభ వర్తనములు । తనువచ్చి పొందినఁ దగులంబు నొందక సర్వ వస్తువులను స్వాత్మకాఁగ । నిర్వికారంబైన నీవృత్తి గ్రహియించి ధీప్రజ్ఞచే స్వాత్మదేవతకు సమర్పణం బొనరించి యద్వయామలనిత్య నిరుపాధికుండవై నెగడు తండ్రి । ఆత్మ పూజకు వలయు ద్రవ్యముల నీకు । నెఱుఁగఁ జెప్పితి నెఱిఁగితి విఁకను దేవ । పూజ సల్పుచుఁ బాపము ల్పుణ్యములును । లేని సువివిక్త దేశంబులో నిలువుము.

పంచపాదితేటగీతము.

౪౯౭. శ్రీగురుస్వామి కరుణచేఁ జిత్సమాధిఁ | దోఁచు స్వానుభవమున నుద్బుద్ధమగుచుఁ|బొంగి పొరలిన యానంద మును వచింప|వచ్చు వఱకేను దెలిపితవ్వాలి తెఱఁగు|వేత్తల రయుఁడు నిర్వాణ విభవమనుచు.

పంచపాదితేటగీతము.

౪౯౮. సర్వవేదాంత శాస్త్రముల్ సంగ్రహించి|బ్రహ్మ వాదోక్తులను గానఁ బరఁగఁ గూర్చి | గురు హితాలాపము లు కొన్ని కూడఁ బెట్టి | స్వానుభవమునఁ బొందించి సరస ఫణితిఁ | జెప్పితిని దీనిఁగనఁగనఁ జేయు పరము.

౪౯౯. క॥ ఇది మోక్షశాస్త్రమగుటన్|జదివిన వ్రాసినన వినిన సాధకులకు వే | విదితంబట మోక్షార్థం | బొదవ ర్థకామరాధయుక్త శుభంబుల్.

గద్య॥ ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమ చ్ఛంకర భగవత్పాదాచార్య దీక్షా సాంప్రదాయక శ్రీమద్వి ద్యానంద గురుకటాక్ష లబ్ధ శ్రీరాజయోగ విజ్ఞాన సమార్గ విరాజమాన శ్రీపూర్ణానంద దీక్షానామ విశ్రుత బ్రహ్మణ్య సుబ్రహ్మణ్య ప్రణీతంబైన శ్రీబోధానంద గీతలను శ్రీ బ్రహ్మ విద్యావిలాసము.